శ్రీరస్తు.

# చెన్నపురీవిలాసము

శ్రీ మతుకుమల్లి నృసింహశాస్త్రిగారి
కృతము

చెన్నపురి

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచేఁ
ప్రకటితము.

1941

# పీ ఠి క

ఆంధ్ర ప్రబంధములలో నొకపట్టణముయొక్క వైభవ మును యథాస్థితముగావర్ణించినవి లేవు. ఈచెన్నపురీవిలాస మున క్రీ. శ॥ 1863 ప్రాంతములఁగలపట్టణపరిస్థితులన్నియు సమగ్రముగాఁ గన్నులకుఁ గట్టినట్టు కవి వర్ణించెను.

ఇదిరచించినకవి యుభయభాషలలోను ప్రౌఢప్రబంధ నిర్మాణసమర్థుఁడగుటయే కాక లోకజ్ఞుఁడు. వస్తువిశేషములను దెలుపునపుడు సుబోధమగుటకై వాడుకలోనికివచ్చిన ఆంగ్లేయ పదములనువాడుచు వస్తుచయమును వర్ణించెను. ఈవిద్వత్కవి యింటిపేరు మతుకుమల్లివారు. ఈయనపేరు నృసింహశాస్త్రి. వల్లూరి ప్రభువులగు బొమ్మదేవర నాగభూపాలుని యాస్థాన మునుండి వారియాదరముఁబడయుచు వారిప్రార్థనమునఁ జెన్నపురిస్థితిని ప్రబంధముగా రచించెను దీనిని చరిత్రముగను అప్పటి చెన్నపురిప్రతిబింబముగాను గ్రహింపవచ్చును.

దీనిననుసరించి పటమువ్రాయించినచో క్రొత్తగాబయలు దేరినవిగాక మిగిలినవీథులు, భవనములు, కార్యస్థానములు ఇవియునవియు ననవేల చెన్నపురిలోనున్నవన్నియు నిందు స్పష్ట ముగాఁ దెలియును. ఇప్పటిచెన్నపురికి అప్పటిచెన్నపురికిఁ గల భేదము గోచరించును. వీథులపేర్లలోఁ గలిగినకొన్ని మార్పులఁ జూచినయెడల వానిమొదటియథార్థస్థితియుఁ దర్వాతగలిగిన మార్పులు తెలియుటయేకాక వానికిఁ గారణములుగూడ విమర్శకులకు గోచరించును.

ఈ ప్రబంధమును మొట్టమొదట (1863) ఎనుబదిసంవత్సరముల క్రితము వచ్చినదుందుభి సం. శ్రావణమాసమున శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు స్వకీయముద్రాక్షరశాలలో ముద్రింపించి ప్రకటించిరి. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి కప్పటికే ఆదిసరస్వతీనిలయ వివేకరత్నాకరముద్రాక్షరశాలలు రెండుండెడివి. దానిని శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి కుమారులు సుప్రసిద్ధులయిన భాషోద్ధారక శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారు నేఁడు పునర్ముద్రణముగావించి త్రిలిఙ్గరజతోత్సవ సమయమున నందఱకుఁ బుష్పోపహారములతో సమర్పింతురు. చరిత్రవిమర్శకులు, భాషావిమర్శకులు నిందలివిషయములను బరిశోధించి తమకుఁదోఁచినభావములను చెన్నపురియభివృద్ధి కుపయోగింతురుగాక! భాషావేత్తలు మనవిద్వత్కవిప్రబంధ విశేషములఁ జదివి కావ్యానంద మొందుదురుగాక! అప్పటిచెన్నపురిస్థితిని మనమహాకవి శాశ్వతముగావించినట్లు నేటికవులు ఇప్పటిపట్టణపుస్థితిని యథాస్థితముగావర్ణించి శాశ్వతముగావింప యత్నింతురుగాక! ఎల్లరును నూటేండ్లప్రాంతముననున్న చెన్నపురిలోనివిలాసములను గ్రహించి యానందింతురుగాక! మనకిట్టి యవకాశముగలిగించిన శ్రీ భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారి కితోధికాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గలుగుగాక!

సర్వేజనాస్సుఖినో భవంతు.

శ్రీపాదభవనము,
తిరువళ్లిక్కేణి.
6-7-1941.

ఇట్లు, విన్నవించువిధేయుఁడు,
**శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి,**
మద్రాసు యూనివర్సిటీ ఆంధ్రశాఖోపన్యాసకుఁడు.

# విషయసూచిక

## ప్రథమంబగు స్వరూపపద్ధతి.



## ద్వితీయంబగు పూర్వపద్ధతి.

## తృతీయంబగు దక్షిణపద్ధతి



## చతుర్థంబగు పశ్చిమపద్ధతి



## పంచమంబగు నుత్తరపద్ధతి.

విషయము. పుట.



## షష్ఠంబగు సంతరాళపద్ధతి.

| విషయము. | | | పుట. |
|---|---|---|---|

శ్రీ ర స్తు.

# చె న్న పు రీ వి లా స ము

## ప్రథమంబగు స్వరూపపద్ధతి.

### ౧. మంగళ ప్రకరణము.

శ్రీమద్భీష్మసుతాస్వయంగ్రహసమాశ్లేషాప్తినాత్మీయబా
హామధ్యంబున లగ్నమౌఘుసృణపంకాంకంబు వీక్షించుచో
భామ౯ గౌస్తుభకాంతికైతవమున న్వంచించులీలాభిక
స్థేము న్గొల్చెదఁ దోట్లవల్లురిపురశ్రీవేణుగోపప్రభున్. 1

మ. సరయస్తంభభిదార్భటీవిదళదాశాభిత్తిసంధిస్థిరీ, కరణవ్యగ్ర
సరోజసంభవకరాగ్రక్షిప్తమృత్పిండవీ,క్ష్యరయోద్ధూతసటా
చ్ఛటాచటులజంఝామారుతాభ్రాటదు,ర్భరభూధ్రం బగు
మాల్యశైలనృహరిబ్రహ్మాంబు న౯ బ్రోవుతన్. 2

క. వాణి నలివేణి నతగీ
ర్వాణి ఘనశ్రోణి మధురవాణిఁ బరమక
ళ్యాణి విపంచీపుస్తక
పాణి న్మదిఁ దలఁతు వారిభవభవురాణిన్. 3

ఉ. అక్షయదుగ్ధపూరభరితాంతరమైన సుధాపయోధియ
భ్రక్షురదాగతోదకఝురంబులు లోఁగొనదే యుదారవా
గక్షతసేవధు ల్బుధు లన్యకృతు ల్మది మెత్తు రౌటఁ దా
దృక్షవిభూతి మత్కృతి గ్రహింప నుతింతు సుధీవతంసులన్.

వ. అని యివ్విధంబునం బ్రారిప్సితప్రబంధప్రతిబంధిప్రత్యూహ
వ్యూహాంధకారవిధ్వంసనాహస్కరం బగునిష్టదేవతానమ
స్కారంబును శ్రేయస్కరంబగు సుకవిజనోపస్కారంబునుం
గావించి యత్కించిదభినవప్రబంధనిబంధనోత్సాహబంధుర
స్వాంతుండనై యున్నసమయంబున. 5

## ౧. కృతినాయకప్రకరణము.

సీ. తన కీర్తిరుచి మరుత్వన్ముఖాశాధీశ
సౌధరాజికి సుధాచర్చ గాఁగ
దన ప్రతాపోష్మ పద్మభవాండమంటపా
భ్యంతరంబునకు దీపార్చి గాఁగ
దనగుణశ్రేణి సత్కవికల్పితానల్ప
కృతికన్యకల కలంకృతులు గాఁగ
దన వదాన్యత యాచకనికాయచాతక
శ్రేణికి భూరివారిదము గాఁగ
తే. బ్రజలు రాజాబహద్దరు ప్రభృతినిభృత
బిరుదపుంఖితఢక్కాగభీరనినద
భీతభీతాఖిలాహితవ్రాతుఁ డగుచు
బొమ్మదేవరకులనాగభూవిభుండు. 1

మ. జనులెల్లన్జగతీమహేంద్రుఁ డనఁగా సామ్రాజ్యసంపూర్తిఁ జే
ర్కొన వల్లూరువసంతవాడ మరియుం గూడూరునాఖ్యాతిగాం

చిన రాజ్యంబు లనంతధాన్యధనలక్ష్మీపూర్ణత న్మించఁగాఁ
దనరున్నాగనరేంద్రుఁ డుద్భటభుజోద్దామప్రతాపోన్నతిన్.

ఉ. అయ్యవనీతలాధిపజనాగ్రణి గౌర్నరుమెంటువారి క
క్షయ్యవిభూతిచే నమితసంఖ్య మహాశకటప్రచారసా
హాయ్యము పేర్మి సైన్యములకాహవసన్నహనోద్యమంబులం
జయ్యనఁ జేసి మేల్గను నజస్రతదార్జితవైభవోన్నతిన్. 3

మ. ప్రకటప్రీతిని హయాణవల్లభులు క్యార్కట్టర్లు నారాజపు
త్రకచూడామణి కిచ్చి మెచ్చెదరు హైదర్బాదులోనన్న బా
బాక మేల్కల్కితురాయి రత్నరుచిరం బుద్యోతి వజ్రాక్షకీ
ర్ణకరాకల్పయుగంబు నర్థి నిడె సన్మానక్రియావైఖరిన్. 4

శా. నాగక్ష్మాపతి శేషమాంబికులకు న్గారాబుపౌత్రుండు పు
ణ్యాగణ్యాద్భుతకీర్తి వేంకటనృసింహక్షోణిభృద్రాజ్యల
క్ష్మీగర్భాంబుధిపూర్ణచంద్రుఁ డతఁ డున్మీలత్ప్రభావాఢ్యుఁ
డా, నాగక్ష్మారమణప్రచారములు నానాద్వీపవిఖ్యాతముల్. 5

ఉ. హాటకశైలకూటతతు లల్లలనాడిన భూమి గ్రుంగినన్
బీటలు వాసిన న్నభము బింకము శేషుఁడు దప్పినం బ్రజా
కోటికి బొమ్మదేవకులకుంజరుఁ డాడినమాట దప్పఁ డే
నాఁటికి నాగభూవలయనాయకుఁ డారఘురాముకైవడిన్. 6

వ. వెండియు నాఖండలవేదండశుండాదండమండిత ప్రచండ
భుజాదండ హిండమానసముద్దండతాండవితమండలాగ్ర
విఖండితారాతి మండలేశ్వరసకుండలమకుటమస్తకమాలికా
సమర్పితబేతాళుండును డిల్లీశ్వరప్రసాదసమాసాదితరాజా
బహాదరు జమీందారు ప్రభృతిబిరుదసముట్టంకితధకా

గభీరభూరి భేరీభయంకరభాంకార హఠాత్కారశ్రవణఝు
డిలి ఘటితవైహ్వాల్య వివశ పరిపంథి వసుంధరారమణుండును
సమరధాటికాసమయ సమంతతః ప్రసృమర పరస్సహస్ర సేనా
పురస్సముత్తంభితాభ్రాంతరమరుద్వశవిభ్రామితాభ్రాపగావి
భ్రమాదభ్రశుభ్రతర బిరుదకేతనపతాకాలోకనమాత్ర కాతర
కాందిశీకపారశీక కరూశాది నానాదేశాధీశ్వరుండును నగు
నమ్మహీపాలచంద్రుని వినుతింప నప్పలుకుచెలికైన నలవియె
మఱియును. 7

ఉ. ఆనరపాలలోకమకరాంకుఁడు వేంకట నారసింహరా
ట్సూనుఁడు బొమ్మదేవరవిశుద్ధకులాబ్ధిమృగాంకుఁడాబృహ
ద్భానుఁడు దీప్తిఁ బూర్ణసితభానుఁడు కీర్తిఁ బ్రతాపవైఖరిఁ
భానుఁడుగాన నాగజనపాలుఁడు చూడ నృపాలమాత్రుఁడే.

సీసమాలిక:—

శ్రీవేణుగోపసంసేవైకహేవాక
పాకోపనతపక్వఫల మనంగ
సర్వాతిశయమహోజ్జ్వలమహారాజాది
రాజరాజశ్రీవిరాజమాన
భోగయాసీమరాణీగారు సైన్యసా
హాయ్యంబునకు మెచ్చి యానతీయ
ముదమంది కలకత్తమదరాసుగౌర్నరుల్
చెలిమి వాటిల్లఁగా సెలవు సేయ
బందరుపురములోపలఁ గలెక్టరు జడ్జి
కర్నలు మొదలుగాఁ గలుగు దొరలు

హిందూనరేంద్రులు నందఱు సభఁజేసి
యపరిమితోత్సాహ మతిశయిల్ల
రాజాబహద్దరు ప్రభృతిసద్బిరుదాంకుఁ
డురుతర బొమ్మదేవరకులాబ్ధి
చంద్రుఁడౌ నాగరాజన్యదేవేంద్రున
కవిరళవైభవోత్సవము లమర
శాలివాహనమహాశకవత్సరంబులు
గుణవారణమునీందుగణన గల్గు
రౌద్రినామవత్సరమున నాశ్వయుజీయ
బహుళపంచమి మందవాసరమున

తే. భాసురస్వర్ణమయ మైన బాహుపురియు
రమ్యకాశ్మీరపట్టాంబరద్వయంబు
ఘనత మీఱ బహూకృతిగా నొసంగి
రానృపోత్తముగరిమ నే మనఁగవచ్చు. 9

సీ. శాలివాహనమహాశకవత్సరంబులు
భుజగజమునిచంద్రపూర్ణసంఖ్యఁ
బరగుసిద్ధార్థిసంవత్సరంబునమాఖ
బహుళతృతీయార్కవాసరమునఁ
గొప్పాకపుర వేణుగోపాలదేవాల
యాగ్రభాగంబున నలఘుపటిమ
బొమ్మదేవరకులాంబుధిపూర్ణచంద్రుండు
పట్నాలగోత్రాబ్జపద్మహితుఁడు

తే. ప్రబలరాజాబహద్దరు ప్రభృతిబిరుద
శాలి యైనట్టి నాగభూపాలమౌళి

తేజమింపొందఁగ ధ్వజప్రతిష్ఠ సలిపెఁ
దనరఁ దనకీర్తి యాచంద్రతారకంబు. 10

తే. అట్టి శ్రీనాగభూమిపాలావళీవ
తంసకమ్ము మున్నొక నిమిత్తంబువలన
విడిన గూడూరు పరగణాపేర వెలయు
జీర్ణరాజ్యంబు మరల నార్జింపఁ దలఁచి. 11

తే. శాలివాహనశాకవర్షములు గుణగ
జర్షిశశిసంఖ్యగలరౌద్రివర్షమాఘ
బహుళపక్షతృతీయాజ్ఞవాసరమున
నిష్టదేవత నర్చించి యెలమి మించి. 12

సీ. ప్రస్థానభేరినిర్భరభూరిభాంకృతు
ల్వ్యానభోంతరమున బోరు కలుగ
హస్త్యశ్వరథభటాభ్యధికసంరంభంబు
కడిమిచేఁ బుడమి గ్రక్కదలి పొదల
బిరుదకేతనపటప్రేంఖోళితప్రభ
ల్గగనభాగంబునఁ గడలుకొనఁగఁ
గవి బుధప్రవర బాంధవ మంత్రివర్గము
ల్వాహనారూఢత వరుసఁ గదలఁ

తే. బరమవిభవంబుతో నాత్మపురము వెడలి
పటకుటీరపురీభవదటవియగుచుఁ
గతిపయప్రయాణంబుల ఘనత మీఱి
చెన్నపురిఁ జేరి హర్షంబు చెన్ను మిగుల. 13

మ. మహిమం జాకలపేటఁ దంజపురి రామానాయనింగారిచే
విహితంబౌ మహితాగ్రహారమున సావిర్భూతశాఖానికా

యహిమప్రాయతలద్రుశోభితతదీయారామసౌధంబులో
రహిమీఱన్నివసించి యాత్మపరివారవ్రాతము ల్గొల్వఁగన్.

చ. ఘనతఁ గమిస్సెరీదొరల గొర్నరుగార్లను నెక్రిటేరులన్
గనఁగఁ గమిస్సెరీజెనలుగారు శిఫారసు సేయ మెచ్చి నె
మ్మనమున కూర్మి నానృపతిమౌళికి గొర్నరుమెంటువారు
భూజను లలరారఁగా వసుకు మొసంగిరి క్రమ్మఱ రాజ్య
మియ్యఁగన్. 15

వ. ఇవ్విధంబునం బునర్లబ్ధాభిమత రాజ్యలాభ ప్రమోద మేదుర
హృదయారవింద కందళిత ప్రసాదసూచక శుచిస్మితాలంకృత
సుముఖారవిందుండై చెన్నపట్టణంబునఁ బూర్వోక్తసౌధోపరి
భూమికాభాగంబున దివ్యసభామండపంబున భద్రసింహాస
నంబున మహేంద్రవిభవంబుల సిరుల నిరవొందుచు సచివ
సామంత బాంధవ కవి విబుధనికర వీరభటానీకంబు గొలువ
నిండుగొలువై యుండి. 16

## ౩. కృతిప్రకరణము.

మ. నను మాల్యాద్రినృసింహభక్త్యుదితనానాశాస్త్రపాండిత్యశా
లిని శ్రీమత్కనకాద్రిశాస్త్రిసుతు ధీశేఖర్షభాచార్యుఁ బా
వనసత్కాశ్యపగోత్రసంజనితు నాపస్తంబసూత్రు న్సమీ
పనివిష్టు న్నరసింహపండితుని సంభావించి పల్కెం దయన్. 1

సీ. క్షమ విహరించు వాక్పతిపుట్టినయిలుమ
తుకుమల్లికులమతల్లిక తదన్వ
యోదితు ల్వేంగళార్యాదులు మాల్యశై
లనృసింహకరుణోపలబ్ధవరచ

తుష్షష్టివిద్యావిధులు భవత్ప్రపితామ
హుండు మాధవకవీంద్రోత్తముఁ డభి
నవభారతాదినానాగ్రంథకర్తనీ
తాత నృసింహావిద్వద్వరుండు
తే. శబ్దశాస్త్రత్రయీవిచక్షణుఁడు నీదు
జనకుఁ డైనట్టి కనకాద్రిశాస్త్రివర్యుఁ
డఖిలశాస్త్రార్థవేది నీవద్భుతప్ర
సిద్ధసారస్వతుఁడవు నృసింహశాస్త్రి. 2

చ. పురములలోనఁ జెన్నపురిపూర్ణవిలాసము వర్ణనీయమై
ఖరి యగుఁగానఁ దత్పురవికస్వరచారువిలాసవర్ణన
స్ఫురణ నొనర్పు మొక్కకృతి భూరిగభీరతరార్థగుంభన
ర్మరసభరంబుగా మతుకుమల్లి నృసింహకవీంద్రశేఖరా. 3

వ. అని సగౌరవంబుగా నానతియొసంగినం బొంగి యభంగుర
ప్రమోదతరంగితాంతరంగుండనై యమ్మహారాజదేవేంద్రున
కభ్యుదయపరంపరాభివృద్ధిగా నొనర్పంబూనిన చెన్నపురీ
విలాసంబను ప్రబంధంబునకుం బ్రారంభం బెట్టిదనిన. 4

## ౧. సన్నివేశప్రకరణము.

శా. శ్రీశోభాద్భుత మబ్ధితీరవసతిస్థేమాభిరామంబు నా
నాశాఖానగరాభిశోభిత మభిన్యస్తేష్టికానద్ధర
థ్యాశుంభద్రథరాజి చెన్నపురి చెల్వారుం జిరస్ఫూర్తిహూ
ణేశాధిష్ఠితరాజధాని మదరా సీయుర్వరాస్వర్గమై. 1

మ. చతురంబై చతురశ్రమండలసమస్థానస్థితంబై మహా
ద్భుతశోభాస్పదమై యభూతచరమై పాల్పారి క్రోశద్వయా

యతవిస్తారము నొప్పురిఁ సపరిణాహాస్ఫూర్తి రాణించు నం
చితపార్శ్వద్వయసాంద్రసౌధనివహశ్రీవీధికాశ్రేణికల్. 2

మ. వరవప్రావృతమై యుదగ్దిశ సుదన్వత్తోయదుర్ధర్ష దు
స్తరమై తూర్పున దక్షిణంబున సముద్యద్యంత్రదుర్దర్శదు
ర్గరమాదుర్గమమై ప్రతీచిని మహాగాధాబ్ధిశాఖాప్రవా
హరయాఢ్యంబయియొప్పునప్పురమభేద్యంబై యజేయస్థితిన్.

తే. ఆపురోత్తంసమరయ ముత్యాలపేట
పెద్దినాయనిపేట నా ద్వివిధమయ్యెఁ
బ్రకటసీమావిభాగవిభక్తవిపుల
విపణికాపణవీథికావితతమగుచు. 4

చ. అమరఁ బురప్రతోళికల నంతటనంతట నిల్పుదివ్వెకం
బములపయి న్వెలింగెడి విభాసితదర్పణపేటికాప్రదీ
పము లలరారు రేల రవి పర్వఁగఁ దోఁ జనలేక చిక్కున
ర్యమకిరణాళిఁ బట్టి యిరులప్పురిఁ గారలఁ బెట్టెనో యనన్.

మ. ప్రజ వర్ణింపఁ బ్రతోళికావిపణికాపణ్యాపణాట్టాలక
వ్రజమం దంబరవీధిఁ బాసి నగరిం బ్రాపించుతారాగణం
బు జగల్మీఁ ఱ నిశాముఖంబులఁ బురిం బొల్చుఁ దివారాత్ర
ఘృష్టిజసంధ్యానలవిస్ఫులింగశకలశ్రేణుల్ ప్రదీపావళుల్.6

చ. అలరును భూతధాత్రి వివిధాఖిలవస్తుమహాసమృద్ధి ను
జ్జ్వలమగుతత్పురంబు జలజాతభవుం డధికప్రపంచకృ
త్యలఘుత కాత్మ మెచ్చక తదల్పతదత్యభిరామరేఖ రా
జిల మరలన్ సృజింప విలసిల్లు జగద్వలయంబు నాఁ దగన్ .7

## ౫. వీథీప్రకరణము.

చ. అరయ విశాల మీనగర మౌ నని వేరె నుతింపనేల యం
దిరుదెస మేటిమాడువులు హెచ్చగు గచ్చుటరుంగుపంచలు
న్బరపగు నంగణంబులును నారికెడంపుఁగటంపుబందిరు
ల్వఱలఁగ వీథికాశత మెలర్చెడిచోఁ దతదీర్ఘరేఖమై. 1

చ. ఇరుగడ నొక్కటొంటి కెడమియ్యక క్రిక్కిఱియంగఁ
గొండల, ట్లరుదగుహర్మ్యమాలిక లహర్పతిమార్గము గప్పి
యొప్పు నప్పురవరవీథులం జనులు పూర్ణసుఖాప్తిఁ బగళ్ల
నెండ సోఁ,కెఱుఁగక సంచరింతురు నవీనత రెండవజాము
దక్కగన్. 2

## ౬. సౌధప్రకరణము.

ఉ. బాలికలెల్ల నానగరిబంగరుమేడలలోఁ జరించుచో
జాలకమార్గగామియగు చందురుఁ బట్టఁగఁబోయి పట్టఁగాఁ
జాలక నేటికేఁమి యొకసారి తొలంగెఁ దొలంగుఁ గాక రే
యేలిక రేపు పట్టెద మ దెంతని పల్కుదు రాత్తముగ్ధతన్. 1

చ. కువలయపత్రలోచనలఁ గూడి సుఖించుచుఁ గేళికారస
ప్రవణనిజాంతరంగులు ఫరంగులు నిల్వఁగ సప్తభూమికా
భవనములొప్పు భూరిబలవారచరత్సురసిద్ధదంపతీ
నివహములైన తారధరణీధరమందరశైలముల్బలెన్. 2

క. వరతత్పురరుచిరోన్నత
తరసౌధవిటంక సంతతవ్యాఘాతో
పరచితకిణ మాశశినలు
పరయక పామరులు హరిణ మందురు దానిన్. 3

మ. లలనల్ ప్రోన్నతసౌధశృంగములమ్రోలం బొల్పు దోశ్శ్రీ
వాహినీ, పులినశ్రేణుల నాడఁబోయి తమసొంపుంబెంపు
నిష్పందదృష్టులచేఁ జూచుతురంగగాత్రతురగాస్యల్లోను
గాఁ గల్గువేల్పుల నీక్షించి భయంబునం దదురంబు ల్గొత్తు
రాప్రోలునన్. 4

## 2. మహిమప్రకరణము.

మ. ఎరణాయూరును గత్తివాక యడయారెన్న న్మైలంబూరు
మేల్తిరువట్టూరును రాయపేట తిరువల్లిక్కేణి చేపాకయు
న్బరశుంవాక పరంగికొండ మఱి కృష్ణాంపేటయుఁ లోనుగాఁ
బురిచుట్టుఁ విలసిల్లు నాటుపురముల్ భూతిం దదేకాకృతిన్.

సీ. కుంభకోణము కల్లికోట కర్నోలు బ
ళ్లారి చిత్తూరు సేలంబు కడప
కబడాలబందరు కనరామధుర తిక్న
వల్లియు తిరిచెనాపల్లి మఱియుఁ
గోయముత్తురు మంజకుప్పంబు నాఁగ చెం
గల్పట్టు నెల్లూర నల్పపటిమ
వఱలు గుంటూరు బందరును రాజమహేంద్ర
వరమునాఁగ విశాఖపట్టణంబు

తే. ననఁగ శ్రీకాకుళము గంజమనఁగఁ బరఁగు
నిరువదియు రెండుజిల్లాల కిరవుమీరు
రాజకార్యంబులకు నెల్ల రాజధాని
యాఁపురప్రాభవము భువినసదృశంబు. 2

మ. పురికిం జుట్టును బశ్చిమోత్తరదిశాభోగంబులఁ లోహము
ల్గరఁచం బూన్చినయంత్రకూటములపైఁ గన్పట్టునాత్మాహితా

మరలోకం బడపం బురం బిడిన సమ్యగ్ధూశ్శతఘ్నుల్ బలెం
బరమ ప్రాంశుతరాగ్నియంత్రగసుధాబద్ధేష్టికాస్తంభముల్.

## ౮. పౌరప్రకరణము.

శా. భేరీలన్వోలిపించు పెద్దకడుపుల్వ్రేఁగౌ బృహద్ధ్వజపుం
భారంబుం దమమందయానములకుం బ్రాపై విజృంభింపఁగా
భూరిప్రౌఢి మహావృషంబులక్రియం బోలం వినోదింతురా
బేరీలాదిగఁ గొంద అంగడుల గోభృత్తుండిభుల్ తుందిభుల్.

మ. కచభారం బతిభారమాకచభరాఖర్వాతిగర్వారియా
కుచభారం బరయంగఁ దత్కచకుచాత్యుద్రోరుభారాతిభా
రచితం బాకటిచక్రమాటఁ దగుమంద్రశ్రీణియానాభిశో
భిచమత్కారములందుఁ దుందిభలకాబేరీవణిక్స్త్రీలకున్. 2

ఉ. తేలికపారులయ్యరవదేశపుచుట్టుడుపాగ లొప్ప నం
గీలు పదాగ్రసీమఁ దులకింపఁగ ముచ్చెలు కాళ్లఁ జేరుమా
లాలు ధరించి సోయగములం బురవీథులఁ బొల్తురెప్డులీ
లాలఘుతార్హ్వాశేఖమొదలారులు పిళ్లలు సెట్లు నాయకుల్.

ఉ. ప్రొద్దున లేచి గుంటలకుఁ బోయి మొగంబులఁ బ్రామి వచ్చి మే
ల్పద్దులు పుల్లనీరులును జాలఁగఁ ద్రావి పొగాకువీడెముల్
కొద్దిగఁ జేసి లోన బలుగోచులు పైఁబురిచుట్లు నొప్పఁగాఁ
బద్దులతోఁ జరింతు రరవల్ పురవీథులఁ బేదమున్నుగన్. 4

క. పురవీథులహాస్యరస
స్ఫురణకు: బాత్రులయి తిరుగుచుందు రెపుడుఁ గొం
దఱు నేనుఁగుఁగాళ్లం గల
పురుషులు వనితలును స్ఖలితపున్నడకలతోన్. 5

చ. పసుపును నూనె మేనులను బ్రామి పయిఁ నలుఁగిప్పపిండి రు
ద్ది సలిపి నారికేళవనదీర్ఘికలం దిగి తీర్థమాడి య,య్యసమపుఁ
గిలుగంట పిరుదంటఁగఁ దీర్ఘపుగిండి రొండిపైఁ, బొసఁగఁగ
నిండ్లు సేరుదురు ప్రొద్దిటి ప్రొద్దుల ద్రావిడాంగనల్
చ. తెలతెలవేగ మేలుకొని తీర్థపుగుంటల కేగి దోవతుల్
తలతలనొప్పఁగా నుతికి తాపలపైనిడి తానమాడి తా
వులఁ బదిరెండుపుండ్రములు పూని గృహంబుల సేర్చివీటఁ ద్రా
డులపయి నాఱవైతురు మడుంగిడి చేతులఁ దట్టి వైష్ణవుల్.

## ౯. వీరభటప్రకరణము.

చ. పటిమఁ బురోపకంఠతటవాటికల న్వడి బార్లుదీరి యు
ద్భటసుభటచ్ఛటాపటలధాటులు రేపును మాపు బాహుసం
ఘటితములౌ తుపాకులచకచ్చకలొప్పఁ గవాతు సేయ ని
ష్కుటకుటజప్రతిధ్వనిగ ఘూర్ణిలు ఫెళ్లఫెళ త్ఫెళధ్వనుల్. 1
చ. కుదురుగ నందునందుఁ బురిగుత్తికి నిల్వఁగ వీరరౌద్రసం
పదల నెసంగుపోలిసులబంటు లొగిం బడునిద్ద అల్పపుం
గుదియలు పూని లాగులును గుత్తపుకంచుకముల్ ధరించువా
రదయతఁ గాలకింకరభయంకరవృత్తిఁ జరింతురెంతయున్. 2

## ౧౦. ఉపవనప్రకరణము.

సీ. వేణికాంచత్స్నుహీశ్రేణికామ్రేడిత
వేణుకాండాతతావృతులు గలిగి
సురసాలనిభనూతనరసాలముఖచారు
తరసాలషండసంతతులు గల్గి
మల్లికాదికపుష్పవల్లికాలోకమ
తల్లికామంటపోద్యమము గల్గి

యాళీభవత్పద్మపాళీవినోదన్మ
రాళీరుచిరదీర్ఘి కాళి గల్గి

తే. నారికేళవనంబులు నగరిచుట్టు
గార్కొనుచు నొప్పు చీకటుల్ గడలుకొనఁగ
మెఱుఁగు లప్పురిమగువలై మెలఁగుకతన
మొగులు గిన్కను బురిచుట్టు ముట్టె ననఁగ. 1

తే. తద్వనంబులనెత్తు నేతములు సారె
నెగయుటయు వ్రాలుటయును వర్ణింపఁదగును
భువి నధఃపురి దివిని స్వఃపురియటంచు
నభినయించు వనేందిరాహస్తలీల. 2

చ. పురివెలిపేటలం దునుపఁ బొల్పగునారికెడంపుతోటలం
దిరవగుబంగళాల కొకరిద్దఱు ముప్వురు లంజయాంద్రతో
వరశకటాప్తి నేగి ధనవంతులు నాగరులెల్లరాత్రులం
బరగ సుఖింతురెప్డు మధుపానరతోత్సవవిభ్రమోన్నతిన్. 3

మ. పురికిం దక్షిణపశ్చిమంబుల వనాభోగంబులం జూడ గా
ర్నరులుం గర్నలు సెక్రిటేరులు కమాన్డర్లింక జడ్జీ ల్కల
క్టరులుం బాదరులుం గమిషనరులు మేస్ట్రర్లింజినీర్లాదిగా
దొర లుండందగు బంగళాలు చెలువొందు న్నాలుఁవేలుం
దగన్. 4

## ౧౧. శాకశక్రవిక్రయికాప్రకరణము.

చ. తికముకపైటఁ జాఱుచనుతిత్తులు గంతులువ్రేయ సోర్ణగం
డ్లకు సరితూట్ల వ్రేలుచెవులన్ బెనుగమ్మలు తూఁగ ధూమప
త్రకలుషవీటికాకపిశితప్రచలాధరలై చరింతు రిం
చుకవడి శాకవిక్రయికశూద్రజరద్దవిడాంగన ల్పురిన్. 1

సీ. పడఁతిరో తఁసుచల్లపిడతకు వెలయెంత
పెద్దదు డ్డటువైచి పేర్మిఁ గొనుము
తరుణి నీపెరుగుముంతలు పల్చ నైనవి
తోడుగూడిన వవి చూడు మింక
కలికిరో పాలిండ్లఘునతఁ జెల్వగుఁ గదా
పాలిండ్లఁ జూడ మాపటికి రమ్ము
వనజాక్షి నీవెన్నవలపు లూన్పవె ప్రీతి
స్నేహముగలచోట నెరయు వలపు
తే. లనుచు రసనర్మమర్మభావాన్వితముగ
వన్నెకాండ్రిచ్చు చతురంపుప్రశ్నములకు
వరుసననుగతములుగ నుత్తరము లిడుచు
చల్ల లమ్ముదు రప్పురి గొల్లచెలులు. 2

౧౨. పుష్పలావికాప్రకరణము.

ఉ. మొల్లలు మల్లెలు న్మరువముల్ దవనంబులు మించుగొజ్జఁగుల్
సల్లలితంబులైన విరజాజులు జాజులు సంపెఁగల్ సము
త్ఫుల్లములైన గన్నెరులుఁ బూన్చినచిత్రపుఁజెండులెత్తులున్
హల్లకపద్మమాల్యములు నమ్ముదు రప్పురిఁ బుష్పలావికల్. 1

మ. కలితామోదభరానుగభ్రమరఝంకారంబు లింపొందఁగా
లలితామాల్యలతాంతమాల్యములు ప్రేలన్ గోలలుం
బూని వీథులలోఁ గ్రుమ్మరుఁ దూర్యముల్ మొరయఁ జేతో
జాస్త్రముల్ పేర్మి వ్రాటిలనేగించెడి తజ్జయేందిరల మా
టిక్కుం బుష్పలావీతతుల్. 2

సీ. అలిగెదు తనువల్లి నంటినంత లతాంగి
చిలుకుఁ జేసోఁకఁ బుష్పిణికి రజము
గణికలపై మాకుఁ గలదు కూర్మి మృగాక్షి
మాజాతులను గన్న మరలఁ గలవె
పద్మినీజాతి గన్పడ దేమె పద్మాస్య
తావులచే దానిఁ దగఁ దెలియుము
సకియ నీయలరుదండకుఁ గోరి వచ్చితిఁ
దగువెలపెట్టి నాదండ గొనుమ
తే. టంచు సాకూతవిటవచనానురూప
చతురతరనర్మగర్భమోచాసమాన
చారువాచాచమత్కృతుల్ సలిపి పువ్వు
లమ్మెదరు పుష్పలావిక లప్పురమున. 3

౧౩. శకటప్రకరణము.

మ. చతురశ్వద్విహయాన్వితంబులు చతుశ్చక్రాభిరామంబు లం
చితచిత్రాంబరసద్వితానకములై చెల్వారు సారట్లను
న్నతి మీఱ న్విహరించు నన్నగరినానాదేశభూపాలసం
హతి తత్పూర్విభవేక్షణాభ్యుపగతాశాధీశులన్ బోలుచున్.

తే. పేద మున్నుగ నెక్కిన పెట్టెబండ్లు
తట్టులెద్దులఁ బూన్ప సత్వరతఁ బఱచు
గిరిగొనుచు వచ్చుఁ బ్రజ తొలఁగించుపగిది
మ్రోఁగుచు నిరంతరముగ గతాగతముల. 2

మ. సకియల్లో వెలయన్ బయి న్నితిపటచ్ఛన్నంబులై పేటికా
శకటవ్రాతము వీట ఘర్ఘరఘనస్వానంబులన్ బహ్వవీ

థికల న్మించులతోఁ బురంబు గను ప్రీతిన్ వచ్చి గర్జిల్లుచుం
బ్రకటస్ఫూర్తిఁ బరిభ్రమించు నిబిడాభ్రశ్రేణిచందంబునన్. 3

తే. ఇట్టిపోతులఁ బోల్కించియొడ్డబండ్లు
పటురయంబునఁ బఱచు నప్పట్టణమునఁ
దత్పురాద్భుతవిభ్రమదర్శనైక
రభసపవమానదేవతారథము లనఁగ. 4

మ. లలితాకారవిచిత్రవేషరుచిరాలంకారశృంగారమూ
ర్తులు యూరోప్దొరసానులున్ దొరలు దోడ్తోఁ సారటుల్మెట్టి
ద్యోస్థలి నారూఢవిమానులై తిరుగుగంధర్వాప్సరఃకిన్నరు
ల్బలెఁ గ్రీడింతురు వీటవార్ధికడ లీలారథ్యలన్ సంధ్యలన్. 5

చ. ప్రకటతఁ జూడనొప్పుఁ బురి రాత్రుల ఘోరరటద్రుతవ్రజ
చ్ఛకటముఖంబులందు నిరుచక్కి ఘటించిన దీపయంత్రదీ
పికలు పురప్రదీపరుచి విభ్రమధిక్కరణాసహోన్నద
త్ప్రికలుషితభ్రమత్తిమిరదైవతతామ్రతరేక్షణాకృతిన్. 6

స్రగ్విణీవృత్తము.—

అంకముక్తేందుబింబాభవక్త్రాంబుజో
దంకురన్మందహాసావగమ్యోద్దయా
పంకజాప్తోపమభ్రాజితేజోద్భుతా
రాంకవాలంకృతా రాజ్యలక్ష్మీసుతా. 7

గద్యము. ఇది శ్రీమన్మాల్యశైలనృసింహప్రసాదసమాసాదితసకలశాస్త్రసంవిదుపస్కృత సంస్కృతాంధ్రసాహితీపురస్కృతసరససారస్వతచతురవాగ్ధోరణి మతుకుమల్లికులమతల్లి కావ్యవల్లికావియన్మణి కనకాద్రిశాస్త్రిబుధగ్రామణితనూభవాగ్రణి నృసింహావిద్వన్మణిప్రణీతంబైన చెన్నపురీవిలాసంబను ప్రబంధంబునందుఁ బ్రథమంబగు స్వరూపపద్ధతి సంపూర్ణము.

శ్రీరస్తు.

# చెన్నపురీవిలాసము

## ద్వితీయంబగు పూర్వపద్ధతి.

### ౧. సముద్రప్రకరణము.

పరిపూర్ణధాన్యధనభా
స్వరతరగూడూరు రాజ్యసామ్రాజ్యవిక
స్వరవివిధవిభవజితకి
న్నరపతివాఃపతి మహేంద్ర నాగనరేంద్రా. 1

వ. అవధరింపుము. 2

ఉ. ఆపుటభేదనంబునకు నారయఁ దూర్పునఁ దీవ్రవాతవి
క్షేపవిఘూర్ణితోర్మిచయజృంభితభూరిగభీరఘోషణా
టోపముతోఁ బయోధి నెగడుం దదశేషపురాధిరాజతా
ధ్యౌపయికానిశధ్వనదయత్నభవాద్భుతదుందుభిస్థితిన్. 3

ఉ. భ్రాంతి వహించు నొక్కపుడుఁ బాయఁడు చెంతవసించు
నానదీ,కాంతుఁడు జాలి మైకొనఁగఁ గామిక్రియ న్నగరీ
మతల్లి మేల్గాంతికిఁ జిక్కి చూపు నధికంబుగ నూర్మిభు
జాముఖోచ్ఛల, ద్దంతురశీకరస్తబకదంభ సముజ్జ్వల మౌక్తి
కాంజలుల్. 4

ఉ. తుంగత గెల్వ నింగికెగఁదొట్టి సముద్ధతిఁ బొంగుసాగరా
భంగతరంగభంగికలు ప్రాంతగసౌధపదాంతఘట్టనన్

భంగము నొంది లజ్జపడుభంగి విలీనములై జనున్సదా
భంగురవృత్తులౌ జడులు వాంఛితలాభములన్ భజింతురే.

ఉ. శ్రీ మెఱయంగ నంకమునఁ జెల్వగుతద్వరదుర్గలక్ష్మిన
త్యామవిసర్పితాంబుపరిఘాభుజమండలిఁ జేర్చి పుత్రికా
ప్రేమఁ దనర్చునంబునిధి వేమఱు విద్రుమశంఖశుక్తిము
క్తామణిమాలికాళి నుపకంఠ మజస్రమలంకరించుచున్. 6

### ౨. తీరహర్మ్యప్రకరణము.

క. పారావారం బవ్వలి
తీరము గనువేడ్క నిక్కి తివిరినమాడ్కన్
దీరస్థితసౌధములరు
దారం గననగు సమున్నతాగ్రములగుచున్. 1

తే. తీరసౌధధ్వజాగ్రసందీప్తమైన
గుండొకటి ప్రొద్దుతోడ నెక్కు మఱి వ్రాలు
వనధిరాజున కెదురఁ దత్పట్టణేంద్ర
జాలికుఁడు పూన్చునొకయింద్రజాల మనఁగ. 2

### 3. నౌకాప్రకరణము.

శా. తీరస్థోన్నతసౌధరాజి కెదురన్ దీంద్రించుచుం వార్ధిలో
బారు ల్దీఱిచియున్న భూరితరణివ్రాతంబు చూడంగఁ జె
ల్వారుం దత్పురి నబ్ధిరాజపురి హర్మ్యవ్యూహాసన్నద్ధమై
పోరం దార్కొని మోహరించిన విధంబు ల్తేటతెల్లంబుగన్.

శా. ద్వీత్రస్తంభవిచిత్రితంబులు మహావిస్తారదీర్ఘంబులై
నేత్రానంద మొనర్చునావ లుదధి న్వేవేగఁ బర్వం జగ

చ్చిత్రంబుం గను వేడ్కఁ లేచి యసకృద్విస్రంభసంచారియౌ
వృత్రారాతికి లోఁగి దాఁగిన మహోర్వీభృత్తతిం బోలుచున్.

తే. సరకు నింపను దింపను సారెసారెఁ
దరులయొద్దకు దరియొద్ద కరుగుపడవ
లోడలకు మేడలకు మైత్రి నొనరఁ గూర్ప
నిటునటు చరించుచారుల నెనసి వెలయు. 3

క. సంఘములై పోగయోడలు
జంఘాలతఁ బఱచు నెపుడు జలనిధివీచీ
సంఘాతవిహృతిలీలా
లంఘనకృత్తిమితిమింగిలంబులపగిదిన్. 4

౪. సేతుప్రకరణము.

శా. ఓతప్రోతనిఖాతితాయసమయప్రోద్దండదండోపరి
స్ఫ్యాతస్ఫీతవిశాలదారుఫలకాస్తోమంబుల న్వారిలోఁ
బోతవ్రాతముదాఁక గట్టినదిటంపు న్సేతు వొప్పారుఁ బ్రా
గ్ఖ్యాతశ్రీరఘురామసేతురచనాస్ఫూర్తిం దలంపించుచున్. 1

౫. సాధాన్యవాటికా ప్రకరణము.

ఉ. అప్పురి నోడరేవున ననంతములైన యశేషధాన్యపుం
దిప్పలు సూడనొప్పు నతిదీర్ఘగృహోజ్జ్వలధాన్యవాటి నె
ల్లప్పుడు కూర్మిపంటలపొలంతి పురేందిరఁ జూడవచ్చుచోఁ
దెప్పరమౌ సమృద్ధి నటు దెల్పుచుఁ దెచ్చినకాన్కలో యనన్.

౬. నౌకాదీపస్తంభప్రకరణము.

మ. పురదుర్గంబులమధ్యభాగమున నంభోరాశితీరంబునం
బరపై యొప్పు శిలావితర్దిపయి నుద్భాసించు నెల్లప్డు సా

గరథావత్తరికోటికిన్నిశల మార్గంబుం బ్రదర్శింప భా
స్వరదీపం బిడు గచ్చుఁగంబ మొకఁడాశ్చర్యాతిదీర్ఘాకృతిన్.

చ. ప్రమద మొనర్చు రాత్రుల శిరస్థితదర్పణపేటికాంతర
భ్రమదతిచిత్రదీపనికరస్ఫురణం బలగచ్చుఁగంబము, భ్రమయు
దురాజిఁ గాంచుతటి బ్రాతిగ నారతిఁ బట్టుభూరివి, భ్రమ
నగరేందిరోన్నమిత బాహుమృణాళమునాఁ గనుంగొనన్. 2

మ తనరుం గన్గొనఁ దత్సమున్నతపృథుస్తంభాంతరాళంబునన్
జనులెక్కన్ఘటియించు నూర్ధ్వవిలసత్సోపానసంతానమా
ఘనధీభాసితు లింగిలీషులు సమగ్రప్రౌఢిసాధింపఁ జ, య్యన
నయ్యున్నపురంబు దార్కొనఁ గృతంబౌ గూఢమార్గం బనన్.

## 2. సభాప్రకరణము.

చ. ప్రతత రసౌషధీయుతము ద్రావకపూరిత కాచపాత్రికా
న్వితము విచిత్రయంత్రపరివీతము గంధకలోహరజ్జుసం
యుతమును దజ్జ్ఞ సేవితమునై తగి యౌషధసిద్ధతాపసా
యతనముఁబోలు తాంత్రికసభాయతనంబుపురంబుతూర్పునన్.

మ. పెనుపొందున్నగరంబుతూర్పునను సూప్రీమ్కోర్టునాఁ జిన్ని
కోర్టును సీకష్టమునాఁ గమిస్సరియునా రూపింప నాఫీసులీ
జనలోకంబున సర్వధర్మములు సంస్థాపింప నేతెంచి ని
ల్పినపాకారియమాంబునాథధనశాల్లీలాసభావైఖరిన్. 2

మ. బుధసేవ్యంబులు హేతిభృత్పరిగతంబు ల్దర్శరాడ్దండస
త్పృథముల్పుణ్యజనాశ్రయంబులు ప్రచేతస్థానముల్నాశుగా
భ్యధికోద్యోగము లర్థప్రియము లుగ్రాక్రీడముల్గాన న
ర్థిధరన్మించు దిగీశసంసదుపమాప్తిం దత్సధస్సద్మముల్. 3

మాలినీ.—

శుభగుణమణిపేటీ సూరిమందారవాటీ
యిభహయఘనధాటీ యింద్రవాహోభఘోటీ
స్వభుజబలకిరీటీ శత్రుభిత్ఖడ్గకోటీ
ప్రభుజనపరిపాటీ భవ్యకేత్వగ్రశాటీ. 4

గద్యము. ఇది శ్రీమన్మాల్యశైలనృసింహప్రసాదసమాసాధితసకలశాస్త్ర సంవిదుపస్కృతసంస్కృతాంధ్ర సాహితీపురస్కృత సరససారస్వతచతురవాగ్ధోరణి మతుకుమల్లికులమతల్లికాబ్జవల్లికావియన్మణి కనకాద్రిశాస్త్రిబుధగ్రామణితనూభవాగ్రణి నృసింహావిద్వన్మణిప్రణీతంబైన చెన్నపురీవిలాసంబను ప్రబంధంబునందు ద్వితీయంబగు పూర్వపద్ధతి సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# చె న్న పు రీ వి లా స ము

## తృతీయంబగు దక్షిణపద్ధతి

---

### ౧. దుర్గప్రకరణము.

శ్రీతోట్లవల్లురీనగ
రాతతకంఠీరవాసనాధీశ్వర వి
ఖ్యాతయశోజితశరనా
నాతారతుషారచంద్ర నాగనరేంద్రా. 1

వ. అవధరింపుము. 2

చ. తగునలపట్టణంబునకు దక్షిణభాగమునం దసాధ్యమై
నెగడెడుసీమఁ గోటక్రమనిమ్నముగా వసుధాతలాంతరో
పగ మయి సంభ్రమద్ధృఢకవాటపటిష్ఠతరాట్టకూటయం
త్రగణశతఘ్నికాభినిహితధ్వజినీబహుగుల్మగుప్తమై. 3

మ. పరిఘాఘుత్రితయత్రివప్రయుతమై భాసిల్లులోకోటలోఁ
బరఁగున్ గౌర్నరుమెంటు త్రేజరు దలంప న్మిలిటైరీరచ్చచె
చ్చెరఁ గౌంటాంటునులోనుగాఁగలసభల్చెల్వారుబల్ స్టోర్లుపె
క్కురుసోజర్లవిబారకీసులు ఫరంగుల్బల్పిరంగుల్గనన్. 4

తే. బుడతకీసులు సోల్జరుల్పొదలుచుండ
బారకీసులగదులు పెంపారునందు

శరభశార్దూలహర్యక్షసంఘనిబిడ
మందరాచలకందరబృంద మనఁగ. 5

చ. వినుతపరార్థ్యవేషులగు వేలకొలందిదొరల్సమున్నతాసన
ముల నిల్వ నీలపటసంవృతిమత్ఫలకాళిముందునూల్కొన
లిఖియించురైటరులు గొల్వఁగ గౌర్నరుగొల్వు సేయునా
ఘనసభ సొంపుగానవలెఁ గాని వచింపవశంబె యేరికిన్. 6

తే. సరభసవిసర్పి రాజహంసప్రచార
రాజితంబగు క్రౌంచరంధ్రం బనంగ
సంతతశ్వేతకాయసంచారమైన
ద్వారకతూఁగుహాపరంపర దనర్చు. 7

చ. అలమోర్మేనురసంగి బొంబయియు భర్మాసీమపై గోవ బం
గళ కోరంగియు నాదిగాఁగలుగు ప్రఖ్యాతంపుకోస్తాలనా
వలరాకల్నగరీజనంబులకు రేవన్ దెల్పురంజిల్లును
జ్వలసీకప్టనివిష్టకేతనపటుస్తంభాగ్రచేలచ్ఛటల్. 8

౨. సేనాప్రకరణము.

సీ. రణభరంబు కరంబు రహింభరించినడంబు
బొమిడికంబులు శిరంబులఁజెలంగ
రోషంపుననలంపు రుచిముంపనఁగఁ గెంపు
కంకటంపుబిగింపు గరిమనింప
నరిహింసలు రిరంస నలమె నన్నప్రశంసఁ
జల్లడాలసితమాంసలత నెసఁగ
భుజదండతరుషండములమదాంకురతండ
మనఁ దుపాకులఖండఘనత నుండ

తే. శ్రేణులై యాఁజి పరిచితిసేయు చున్న
మిల్టెరీలపటాళము ల్మెలఁగు నందు
మూర్తిమంతంబులగుమదమోహాలోభ
గాఢకోపాద్భుతవ్యతికరము లనఁగ. 1

### 3. శతఘ్నికా ప్రకరణము.

ఉ. దాపగువారిధిన్వెడలి తారుచు లోపలఁ జేరఁ జూచి యా
రోపులు కారఁబెట్టు పొగరు న్మకరప్రకరంబులట్ల గం
డోపలమండలోల్బణమహోర్వ్యధరంబులమాడ్కి వేడ్కకుం
బ్రాపయి యొప్పు నెప్పుడు పిరంగులబారులు గుండ్లప్రోవులున్.

ఉ. యామశతఘ్ని రేయుఁబగలాబలుకోటవినిశ్చితంబులౌ
యామముల న్గభీరముగనబ్ధిఁ బ్రతిధ్వను లుద్భవిల్ల ను
ద్దామత ఘంటికాసహకృతంబయి ఘుర్ఘురఘోష మీన నా
యామికులుం బురప్రజలు నారసి ప్రొద్దుఁజరింతు రెంతయున్.

శా. దూరద్వీపవణిక్ప్రవర్తితబృహత్పోతాగమంబు న్మహో
దారు ల్గౌర్నరులాదిగాదొరలప్రస్థానంబుల న్వృద్ధవి
స్తారాశ్చర్యములన్విచిత్రజయవార్త ల్దెల్పు నెల్లప్డు త
న్నీరంధ్రాభ్రఘనధ్వనద్బహుశతఘ్నీఘోరనిర్ఘోషముల్. 3

### ౪. మేడీసు ప్రకరణము.

మ. విపులంబై తగుకోటలోపల శిలావేదిన్ జతుస్తంభమం
టపమం దాసులుతానుఁడోడి తనబిడ్డన్ దెచ్చి యొప్పించుట
ల్గృపఁ జేకొంటయుఁ గన్పడ న్నిలుపు మేడీసున్ గనన్ దోఁచు
తీం,ద్రపు శ్రీరంగసమాఖ్యపట్టణరణారంభంబు లీనాఁటికిన్.1

### ౫. మండ్రోలు ప్రకరణము.

మ. అతిపీనాంగుఁ డతిప్రమాణతురగాధ్యారూఢుఁడశ్వాజినా
వృతుఁడంఘ్రిస్పృగవాఙ్ముఖాసిధరుఁడై పెంపొందు మం
డ్రోలునా,కృతిఁ జూడందగి యొప్పు నప్పురి కవాగ్దిగ్భాగమి
నుచ్చైఃప్రక,ల్పితవిస్తారవితర్దిమీఁదఁ దిరువల్లిక్కేణి పెన్రో
డ్డునన్. 1

మ. రవిరథ్యంబులఁ బోరఁ జూచు క్రియ దర్పశ్రీవిజృంభించు మే
ల్జవనంబైన హయంబు నెక్కి నిఖిలాశాభర్తల న్గెల్వఁగా
దివికిన్ బోవఁగఁ దట్టి వాజి నెగయన్ దీకొల్పుచున్నట్టుగా
నవు మండ్రోలుఁ గనంగ నిప్పటికిఁ బశ్యద్విస్మయాపాదియై. 2

### ౬. ధర్మాస్థాన ప్రకరణము.

మ. గ్రసదాశేశ్వరసంసదుద్యమము లిన్కంటా క్ససిస్టెంటుటా
క్సు సదర్కోర్టును హేడ్డు పోలిసును నాసొంపారు నాఫీసులిం
పెసఁగున్ దత్పురిదక్షిణంపుదెస లోకైకార్హధర్మంబు మే
లొసఁగన్ జాతిదొరల్ ఘటింపఁదగి బాహ్యోద్యానభాగం
బులన్. 1

### ౭. దక్షిణశాఖానగర ప్రకరణము.

వ. వెండియు నాదండధరదిఙ్మండలంబున నఖండవైభవోద్దండం
బులై మెండుకొని దండిమెఱసి సౌధమండలానుమీఁయ
మాన తత్రత్యజనవిచిత్రవిభవపరిపాకయగు చేపాకయు విపు
లతర విపణివీథీమతల్లి శ్రేణియగు తిరువల్లిక్కేణియు నతి
నిబిడతరోద్యానతరువాటయగు రాయపేటయుఁ బటుతమ
ప్రభాపహసితాలకాపురంబగు మైలాపురంబును నిబిరీసనారి

కేళి విటపఘూటంబగుకృష్ణాంపేటయు హర్మ్యకూటతిరస్కృ తాద్రికూటయగు చింతాద్రిపేటయు హూణేశ్వరసౌధ సందోహ భాస్వరంబై పేటలకు నెల్ల పెద్దగు మాండ్రోడ్డు ననుశాఖానగర ప్రకాండంబులు సదృశమండన శోభా ఖండాభిరామంబులై యప్పట్టణంబునకుఁ బాయని తోడు నీడల వడువున నెగడుచుం గన్నులపండువు సేయుచుండు నందుఁ దిరువల్లిక్కేణియందు మున్న మందరణభరాస్పంద రభసంబున సంక్రందననందన స్యందనం బాందోళికపింఛ దామసుందరంబుగ నతిరయంబునం బఱపుటవలనం బొడ మినబెడిదంపు బడలిక లుడుపుకొనం గడంగి పార్థసారథి యన న్నెగడి యర్చావిభవంబున విశ్రమించిన యావిశ్వ గర్భునియత్యున్నతపురుషప్రమాణంబగు దివ్యమంగళవిగ్ర హంబు రుచిరతరరాజమానవిమానగోపురప్రాకారబహు స్తంభమంటపానీకపతాకికాపుష్కరణీవిలాసంబులును గనుం గొనుట బహుజన్మకృతసుకృతపరిపాకంబునంగాక యూరక యేల చేకూఱు మఱియును. 1

## ౮. పార్థసారథిప్రకరణము.

సీ. అభ్రంలిహాకారవిభ్రమస్ఫీకార
　　　శుభ్రభప్రాకారసుభగరుచులు
మహితశిలాస్తంభమాలికావష్టంభ
　　　మంటపౌఘాదంభమంజిమములు
కనదగ్రలసమానకనకాచలసమాన
　　　కలితోజ్జ్వలవిమానకమ్రగతులు

మూర్ధాంతగోపురాంతర్ధానగోపుర
స్స్పర్థాళుగోపుర ప్రాభవములు
తే. రమ్యభాస్వరకార్తస్వరధ్వజాభి
విలసితవికస్వర ప్రభావిలసనములు
జలపరిష్కారకరణి పుష్కరణి రవణి
పార్థసారథిహారి కందుఁ బ్రథిమఁ జెందు. 1

మ. ప్రథిత ప్రోన్నతపార్థసారథిగృహాగ్రస్థాయి హైమధ్వజ
గ్రథితాలంబితఘంటికాస్తబకసంఘంబుల్ ముహుర్మందవా
తధుతిః ఘల్లురనంగ నిష్కుటతరూదంచత్ఫలాస్వాదనా
విధురంబౌ శుకరాజి సారెకెగయ న్వీన్వీధికిః ఘూల్లునన్ 2

వ. మఱియు నిజభక్తిభావభారభరితభాగవతసార్థసాత్కృత
పురుషార్థసేవధియగు పార్థసారథిమధుమథనునకుం బ్రత్య
బ్దంబు వైశాఖమాసంబున శుద్ధపక్షంబున సమారబ్ధంబగు
సంవత్సరోత్సవారంభసంభ్రమంబున ధర్మకర్తలు భర్మరస
పరివర్మితదర్పణాభిరామంబులు నుత్తంభిత సఫలస్తబకరం
భావష్టంభసురుచిరస్తంభమాలికాగంభీరంబులు దుగ్ధసింధు
ఫేనధవళ తరళ వితానవిలంబమానకాచమయచిత్రదీపయం
త్రమాలికాలంకృతంబులు వికచసురభిళవివిధకుసుమదామ
మంజులంబులు నవిరళనారికేళ దళక ళైకఘటనాపటుతరం
బులు నుత్తుంగతరతోరణాకీర్ణంబులు నై దివ్య విమానంబుల
ననుకరించు కాయమానంబులు తదీయదేవాలయపురో
భాగంబుననుం బురవీథుల నందునందునుం బొందుబఱచి
తన్మందిరాళిందంబు మొదలుగ రథ్యా పథంబు సురభిసలిల

సిక్తసంమృష్టంబు గావించి ప్రతిగృహంబునభినవమంగళా లంకారశోభనంబులు గానొప్పునప్పురంబున నప్పరమేశ్వరు నేగింప మునుకొని నానావిధమణికందళప్రభాసందోహసుందరంబై రోహణవసుంధరాధరంబు చందంబున నందంబొందు దివ్యస్యందనంబుపైఁ గృతాధిరోహణుం జేసి యుగపదాపుంఖితపుంఖానుపుంఖశంఖకాహాళ పటహడమరు డిండిమనిస్సాణనిస్సరన్నిస్వానంబులకు నదరు గదుర బెదరు గొమరు తిమురుఁ బ్రాయంపు తెరగంటి తెఱవలురువడి నొనరించు స్వయంగ్రహపరీరంభ గుంభనంబుల కలరి సురగరుడకిన్నరోరగ గంధర్వసిద్ధసాధ్యవిద్యాధరకింపురుష ప్రముఖ నిఖిలలేఖప్రకరంబులు బహూకారపూర్వకంబుగఁ బలుమఱు బలు దెఱంగులం జేయు జయజయశబ్దంబులకు ననుప్రాసంబులగు వందిమాగధసందోహసుందరామంద స్తవపాఠంబులు పరిఢవిల్ల వేడుకఁ దోడుకొను ప్రోడలగు ద్రావిడవైష్ణవులు గూడికొని యజాండక్రోడంబు పేదెత్త నెలుఁగెత్తి పాడు దివ్యప్రబంధానుసంధానంబులకుఁ దోడై నెగడు నస్తోకసౌవస్తిక భూసురస్తోమభాసురస్వస్తి ప్రవచనంబులు నిండారనాలోకన కౌతుక గతానేకలోక నికరంబుల కలకలంబులు వారించి వేత్రహస్తులు బరాబరులు సేయ మహనీయ మహోత్సవదిదృక్షచే నంతరిక్షంబువలన క్షితితలంబునకుం దిగిన ఋక్షమండలంబులకు సదృక్షంబులైన సురభి తైలధారాప్రజ్వలిత కరదీపికాలక్షంబులు వెలుంగ నొప్పు

మీఁఱుధరిత్రీతలన రత్నంబుసొంపు దమకుం జొప్పడమి విమా
నంబులెక్కి యుప్పరంబున నుండి భరత ఫణితసరణిబహుల
తాండవభేదంబులు దండిగా మెండు సూపు వెలయాంధ్ర
తండంబుల సవిస్మయంబుగా సందర్శించుపురందరపురసుందరీ
సందోహంబు లనియెడుసందేహంబు నాపాదించు ప్రాసాదో
పరిపరిక్రీడత్పురపురంధ్రికానికరంబుల కరకమలంబులచేత
వికీర్యమాణంబు లగు సురభిళకుసుమపరంపరల వలన
సమాగతంబులై మిళిందబృందంబు లభినవపరిమళలోభ
పరిమిళితంబులు గావున మొత్తంబుగాఁ దమసికలఁ జుట్టిన
పువ్వుటెత్తుల నత్తిన గరకలితకనకకుసుమమంజరీజాలం
బుల వారించు చూడవచ్చిన ప్రోడచేడెల కనత్కనక
కంకణ నిక్వాణంబులు రాణింప మాంసలాకలితహల్లోహల
హల్లీసకమల్లకేళీసముల్లాసంబు చెలంగ ఝుడితి జాజ్వల్య
మాన హుతవహ యంత్రమిహిర హిమకరజ్యోతిగపుంజ
జంజన్యమానరోచిర్జాలప్రసరణంబుల కులుకు కలికికులుకు
చిలకలకొలుకుల నలమికొని యలుకలు దీర్పుముదుసలిమగు
వల జరాజర్జరాక్షరాలాపంబు లనువొంద ఘనఘనాఘన
ఘనఘటాకఠోరదీర్ఘనిర్ఘాతఘర్ఘరనిర్ఘోషఘుమంఘుమల్లోహ
నాళ నిధ్వానకోలాహలంబులకు బిట్టులికి నెట్టనంగుట్టు
చెడి మట్టుమీఱు నొండొండ నెట్టుకొని దుట్టువడిదట్టంబు
లుగ నచ్చటచ్చటం బఱచిన నానావిధంబులగునంగడులు
ద్రొక్కి మట్టాడుచుం బట్టినంబట్టువడక కడువడిం బరచుచుం

బరుగెత్తు దర్శనాగతనాగరజనంబెక్కిన శకటంబులకుం గట్టినతట్టులంగాంచి ఘొల్లున నగు గ్రామ్యపల్లవాధరల కరతలతాలశబ్దంబు లుబ్బుమీఱ వీథు లందంద నిలిపినపూఁబందిరుల నాకందర్పజనకుని నిలిపినయెడల నందుండుభాగవతసందోహంబులకుం జందనంబులుం గుందమందారారవిందమాల్యంబులుం దాంబూలంబులు ఫలంబులు పానకంబులు వడపప్పులు సర్పించి సంతర్పణంబు సేయుచుఁ గర్పూరపూరమిళితంబులగు గందవొడులు నవ్వుటాలకు వన్నెకాం డ్రొండొండఁ జల్లులాడ నెల్లెడల మొల్లంబుగ నల్లుకొనుట నందుల్లసిల్ల జనంబు లెల్ల ఫుల్లకాశకానన వైఖరిని బాటిల్ల వలమానమలయపవమాన వేపమాన రథ్యాపార్శ్వభాగసముత్తంభితరంభాస్తంభ లలితతరతరుణ దళ తాళవృంతానిలంబులు పరిభ్రమజ్జనపరిశ్రాంతి నపనయింప నంతటంతట ప్రతిపౌరనిశాంత ద్వారాంతికంబులఁ గాంతతరకాంతాజన కరాంతలతాంతతంతన్యమాననీరాజన మంగళంబు లాజంగమాజంగమనియంత కంగీకరింపం జేయుచుఁ బురప్రదక్షిణంబు సేయించి మరల మణిసౌధాంతరాళంబుం బ్రవేశింపంజేసి వివిధభోగప్రసాద వినియోగంబుల సకలజనులకుం బ్రమోదం బొనఁగూర్చునట్టి యప్పార్థసారథిదేవుని మహోత్సవవైభవంబు గనుంగొన్నవారల కిహంబున సకలకల్యాణకౌతుకంబులబ్బుటయుం గాక కైవల్యంబు కరగతంబై యుండు మఱియును. 3

పృథ్వీవృత్తము.—

ప్రసిద్ధతరబొమ్మదేవరకులోత్థనాగాధిపా
ఖ్యసింధుహరిణాంక వేంకటనృసింహభూపాత్మజా
ప్రసక్తబిరుదీభవద్బహదరూరుధక్కాధ్వజ
ప్రసంజితబహుప్రథాప్రసృతిభీతవైరిప్రజా. 4

గద్యము. ఇది శ్రీమన్నాల్యశైలనృసింహప్రసాదసమాసాదితసకల శాస్త్రసంవిదుపస్కృత సంస్కృతాంధ్రసాహితీపురస్కృతసరస సారస్వతచతురవాగ్ధోరణి మతుకుమల్లికులమతల్లికాబ్జవల్లి కావియన్మణి కనకాద్రిశాస్త్రిబుధగ్రామణితనూభవాగ్రణినృసింహవిద్వన్మణిప్రణీతంబగు చెన్నపురీవిలాసంబను ప్రబంధంబునందుఁ దృతీయంబగు దక్షిణపద్ధతి సంపూర్ణము.

శ్రీ ర స్తు

# చెన్నపురీవిలాసము

## చతుర్థంబగు పశ్చిమపద్ధతి

---

### ౧. పశ్చిమశాఖానగరప్రకరణము.

శ్రీపూర్ణతోట్లవల్లూ
రూపవసద్వేణుగోపకోరుగృహద్వా
స్థాపితసమున్నతాద్భుత
గోపురకృతినిపుణ నాగగోత్రారమణా. 1

వ. అవధరింపుము. 2

సీ. పల్లవరంబును బరశువాకయుఁ జూళ
మణలి సైదాపేట మాధవరము
చేకారెళుంబూరు చెలగు నందంబాక
నుంగముపాక పరంగికొండ
వ్యాసులవాడయు నడయారు నల పెద్ద
మెట్టు తేనాంపేట మేటియైన
కోటూరు ననువెలిపేట లావీటికిఁ
బశ్చిమంబైన దిగ్భాగమందు
తే. సౌధహర్మ్యప్రతోళికాసదననివహా
హారిలేఖసమంబులై యభివిసారి

తాయతానోన్యమిళితరథ్యాభుజాగ్ర
కలనఁ జెలువొందుననుగునెచ్చెలులనంగ. 3

## ౨. పుస్తకసౌధప్రకరణము.

ఉ. పండితమండలంబులకుఁ బందువుసేయునశేషకోశముల్
కొండలఁ బోలి యెల్లెడలఁ గూటగృహంబుల నొప్ప భారతీ
భాండగృహంబునాఁగ నొకభాస్వరసౌధము చూడనొప్పు ను
ద్దండతఁ బ్రోలుపశ్చిమపువండ నఖండవిభూతి తోటలోన్. 1
క. ఆపుస్తకకోశము భువి
భూపస్తవనీయలీలఁ బొలుపగు కాలే
జీపేరనందు లేనిమ
హాపుస్తక మభ్రపుష్పమై తనరారున్. 2

## 3. కొల్వుకూటప్రకరణము.

తే. పురికిఁ బశ్చిమమునఁ గలెక్టరుక చేరి
విపులతరపాదపస్ఫురదుపవనమున
నభినవమనోజ్ఞరుచిరశోభానుభూతి
వఱలును బురేందిరావనీభవన మనఁగ. 1

## ౪. వినోదసభాప్రకరణము.

మ. స్థలజంబుల్జలజంబులున్వనజముల్ శైలాంబుదస్పర్శనా
నలజంబుల్జలభూబిలాంబరదివాన క్తంచరంబుల్విరా
జిల నొప్పారుఁ బురి న్వినోదసభ వాసిం జేతనాచేతనా
ఖిలనానావిధవస్తుసంచయసమాకీర్ణాబ్జజాండాకృతిన్. 1
వ. అది మఱియు నకుంఠితకుతేరక కుటన్నటకురంటక ఘోంటా
ఘ్ఘుటఘుంటాఖుంటీభంటాకి పరిగతకురవకావరణవలయితం

బును సరళసర్జకసాలసల్లకీసన్నక సహకారసైరేయసత్తలా సప్తపర్ణసౌవీరసాతలాసారణీసర్వతోభద్రసక్తుఫలసహాదిసకల సాలసముదయసాంద్రసంకులంబును ద్విదళవిదళితవేణుదళావిరళవిరచితాతరళతర మంటపోద్వేల్లితోత్ఫుల్లమల్లికాగోస్తనీలవల్యాలివల్లికానికుంజమంజులంబును దరువరాంతర సరణికాపార్శ్వసమంచితవిలుంఛితశ్యామాయమానవయవసరేఖాలంకృతంబును నుత్తానముఖన్యస్తకాండపరంపరాతిర్యగానద్ధదండనిబిడదారుపంజర దుర్లంఘ్యతరోభయపక్షపథపరిష్కృతంబునై రుచిరవిపులంబగు నుపవనంబునం బవనాయనసహస్రసంయుతంబై సహస్రనయననికాయ్యంబు విడంబించుచు నంబరతలచుంబిశిఖరకడంబకంబై త్ర్యంబకాచలంబునుం బోలి యతి విశాలోన్నతభూమికాభ్యంతరాభోగభాగంబగుటం బద్మభవాండమంటపంబునకుం బ్రతిభటంబై యొప్పునొక్క మహాద్భుతప్రాసాదంబునకుం బురోభాగంబున నుభయపార్శ్వపరికల్పితకరికరాకారరేఖాపరిష్కృతంబగు సోపానసరణి నెక్కి చన ముందర నిగన్నిగదగణితస్నిగ్ధశిలాగణాస్థగితంబగునంగణంబున నధ్యాసీనుండగునొకరాజాధికారపురుషునినియోగంబునం దదర్పితకోశపత్రంబున నిజనామాంకంబు లిఖించి తత్సౌధగర్భంబుం జొచ్చి యచ్చటచ్చట నిచ్చలుమచ్చికపెచ్చు పెరుగఁగాంచిన మధ్యభాగంబున సమున్నతపీఠికోపరిన్యస్తపేటికాంతర్గతంబులై తదుపరిచ్ఛాదకంబులగు నచ్చంపు మించుటద్దంబుల నుండి బయలునకుం గానఁదగుచు నొక్కచో మత్స్యంబులు కచ్ఛపంబులు మొసళులు భేకంబులు జలూకంబులు నెండ్రులు

నెఱ్ఱిలు నంచలుం జక్కవలుం బాతులుం గొంగలు లకుము
కులు నీరుపాములు శంఖనఖంబులు శంఖంబులు జిల్వాలుం
గల్వాలుఁ దమ్ములుం డెమ్మలు నురుగులుం బురుగులు నత్తెలు
ముత్తెంబులు ముత్తెంపుచిప్పలు కాకిచిప్పలు నుప్పాలుం
గవ్వాలు చివ్వాలు నాచులుం బ్రోచులు మొదలగుజలీయ
ద్రవ్యంబులును మఱియొక్కపట్టున రాచెట్టు రాపువ్వు రాచిప్ప
రాచిదపలుం ధాతువులును వివిధలోహసారంబులు నానావర్ణ
శిలాశకలంబులులోనగు పర్వతీయపదార్థంబులు వేఱొక్క
కెలన నీలపీతశుక్లరక్తహారితకపిశచిత్రవర్ణ మృద్భేదంబులుం
బుట్టకూడుపుట్టగొడుగులును మొదలగు పార్థివవస్తువులును
నింకొక్కనిర్వ్యూహంబున నేనుంగులు సింగంబులు కురం
గంబులు లేళ్లు గుండేళ్లు గండకంబులు శరభంబులు గొండ
గొఱియలు పులులు చిఱుపులులు రేచులుం గీచులు
మన్నులుం దున్నలుం దుప్పాలు నేకలంబులు కొర్నాసులు
గణుతులున్నక్కలు గవయంబులు చమరంబులు మయూ
రంబులు మర్కటాచ్ఛభల్లగోలాంగూలప్రముఖంబులునగు
నాటవిక జంతుజాలంబును నింకొక్కవిటంకంబునం గపోత
పాలికలం గలవింకకలరవ కలకంఠకలహంసనీలకంఠచాట
కైరకీరకుక్కుటాదిశకుంతకులంబులును వేఱొక్క వలభి
నడవిమానుసులుం బెక్కుదీవులమానుసులును మఱియు
నొక్కగోపానసి ననేకద్వీపగత వివిధవర్ణస్త్రీపురుషనిక
రంబును మఱియొక్క యపవరకంబునం బెఱదీవుల వెల
యాండ్రు గ్రొల్లి సల్పుటయు నింకొక్క నిద్దంపుటద్దంపు
గూడులో నొక పెఱదీవిదొరలు.దొరసానులును ననేకచరా

చరనిర్జీవసజీవజీవలోకంబునుం గలిగి యుదరగతాశేషపదార్థ బృందంబుగావున ముకుందతుందకందరంబుచందంబునఁ జెన్నొందుచు వైభవాశ్చర్యంబులకు వైజననంబును జిత్రంబులకుం బాత్రంబును నిఖిలవినోదంబులకు నిదానంబును విలాసంబులకు విశద లాస్యరంగంబును నద్భుతంబులకు నధిక లీలాసదనంబును ముఖ్యవస్తువులకు మూలభవనంబును నగు నమ్మేడ వెడలి మరల నయ్యధికారి యొసఁగుచీటి యాతోటలో వాకిటనున్న మేటిభటునకిచ్చి వానింగడచి లోనికి నడువ నెదుటఁ బటుకఠోర కాలాయసశలాలికావికటఘటితంబై పంజరప్రాయంబగు నొక్కవిశాలమంటపంబునం జిక్కి పూటపూటకు నెక్కుడుగఁ బాటించిగాటంబుగ దీటుకొల్పు జింక చివ్వంగి గొఱియ మేకలులోనగువాని మాంసంబుల గ్రాసంబులు చేకొని మెక్కి పుటపుటనై పొగరెక్కి నిక్కి దిక్కులుచూచుచుం దమ్ముఁజూచుచున్న జనులం జూచి యేచి యీసురేచి తీండ్రించుచు వేండ్రంబుగ గాండ్రుగాండ్రన నఱచుచుం గుత్తుకెత్తి వృత్తపింగళ క్రూరనయనాపాంగరంగంబుల నంగారంబులు గురియం గులాలచక్రభంగి నాభంగురంబుగ సవ్యాపసవ్యంబుగ దదభ్యంతరంబునం బరిభ్రమించుచు నిబ్బరంబుగ నుబ్బి యబ్బరంబుగ బొబ్బలిడు బెబ్బులులు రెండును దదంతికంబునఁ దాదృగ్విధమంటపంబునఁ దాదృశంబుగ సంక్షోభించుతరక్షుద్వయంబును మఱియొక్క చక్కిశాలాస్తంభ నిబద్ధంబులగు ఋష్యగవయంబులును వేఱొక్కయెడం గడుబెడిదంబగు గ ర్తంబునంబడి వెడలనేరక బడిబడి నెగసి దిగంబడి దిగులు

వడి వడిదక్కి సుడివడి బడలువడు నుత్ఫుల్లనిబిడరోమపటల జటిలంబగుట వికటకంబళకర్పటకంచుకావృతం బగువడువున గనంబడునతికఠోరనఖరభల్లంబగునచ్ఛభల్లంబును వేఱొక్క తావున విశాలశాలాంతరాళంబున లోహశృంఖలం గట్టంబడి యుఱ్ఱుంటి వెన్నుగాఁడియొడిసి నమలుటకుంబలె మిగులఁ బొడవగు మెడనెగయనెత్తుచుఁ దన్నుంజూచువారల వెక్కిరించు క్రియ నిక్కి పెదవులల్లార్చుచు మరగాళ్లుగట్టినట్టుల తాళప్రమాణంబగు చరణచతుష్టయంబున ధరణినవష్టంభించి వెనుక కురచనగు తోఁక వ్రేలం గ్రాలుచున్న గండకమృగంబును మఱియొక్క నెలవునం జతుర్దండికాకూటంబున నిచ్చలుం బిచ్చలించు కొండమృచ్చులతోడం గచ్చుకొనుచుం క్రీడించుమర్కటంబులును వేఱొండుదండ నుద్దండం బగు శాలామండలంబునం గండుమీఱి మెండుగ వాశ్వాసించు నశ్వతరియును మఱియు నొక్కెంకి మంటపవిటంకంబులఁ వ్రేలుపేటికలకుహరతటంబుల విహరించువివిధవిహంగమ విసరంబులును నింకొక్కపజ్జ దీర్ఘమంజూషంబున నామిషంబులు మెక్కి మత్తెక్కి నిదురించుకొండచిలువయు మఱియొక్కపెట్టెలోఁ డెట్టెలుగొని బిట్టొండొండం జుట్టుకొని చుట్టలక్రియ నెట్టుకొనుచు బిట్టూర్పుచుం బుసకొట్టు తుట్టెలుం ద్రాఁచులు మొదలగుసర్పంబులునుం గనుపట్ట విస్మయంబునకుం బట్టగునత్తోట గనుగొన్నవారలకు సకల భువనవిలోకనకౌతుకంబు సమకూఱుటకు సందియంబు గలుగునె మఱియును.

మత్తకోకిల.—

తారహీరపటీరశారదతారహారతుషారమం
దారనారదశారదాంచదుదారపూర్ణయశోధనా
సారసారసపత్రసన్నిభచారుదీర్ఘవిలోచనా
ధారుణీతలధీరసత్కవిదైన్యభారవిమోచనా. 3

గద్యము. ఇది శ్రీమన్మాల్యశైలనృసింహప్రసాదసమాసాదితసకల శాస్త్రసంవిదుపస్కృతసంస్కృతాంధ్రసాహితీపురస్కృత సరస సారస్వతచతురవాగ్ధోరణి మతుకుమల్లికులమతల్లి కాజ్జవల్లి కావియన్మణి కనకాద్రిశాస్త్రిబుధగ్రామణితనూభవాగ్రణి నృసింహవిద్వన్మణిప్రణీతంబగు చెన్నపురీవిలాసంబను ప్రబంధంబునందుఁ జతుర్థంబగు పశ్చిమపద్ధతి సంపూర్ణము.

---

శ్రీ ర స్తు

# చెన్నపురీవిలాసము

## పంచమంబగు నుత్తరపద్ధతి.

### ౧. తంత్రీవార్తా ప్రకరణము.

శ్రీమత్తొప్పాకపురీ
ధామ శ్రీవేణుగోపదైవగృహాపురో
భూమినిహితధ్వజోద్ధో
ద్దామయశోభరణ నాగధాత్రీరమణా. 1

వ. అవధరింపుము. 2

ఉ. ప్రోలు సృజించునాఁడచట గ్రుచ్చిననిస్తుల వాస్తుసూత్రమున్
బోలి తుదిన్ శుభార్థముగఁ బూన్చినతోరణవైఖరిన్ గనం
జాలి నభంబు గొల్వ విధి సాచిన మానగుణంబునా నుద
క్పాళిఁ జెలంగుఁ గంబములపై నొకలోహపుఁదీఁగ సోగయై.

మ. అమరుల్తానులు మున్ దపోగరిమ నుద్యద్దూరవార్తాగ్రహో
రుమహత్త్వంబును గాంచి రబ్రముగ నూరోపీను లాప్రోలనో
లిమహాచిత్రముగా ఘటించి రది టెల్లేగ్రాఫునా దాన ని
క్కముగా దూరపుదీవివార్తల నెఱుంగన్వచ్చునేకత్రుటిన్.

క. ద్వీపాంతరములఁ గలవార
లాపురిఁ గలవారలు నెదుటన ట్లఖిలము స

ల్లాపింతు రంతరస్థ
వ్యాపక తంత్రియను ప్రాడ్వివాకి గలుగుటన్. 5

శా. హస్తాహస్తిక సేర్ప దూరపుర వార్తార్థంబు లంతంతటం
బ్రస్తారంబుగ నిల్పు జాంఘికుల శేవర్ల బొల్పగుం దత్సుప్ర
త్తస్తోకేతరలోహరజ్జువున కాధారం బదొ సర్వతో
న్యస్తప్రోన్నతదండకాండసముదాయశ్రేణియం జెన్నఁగన్.

ఉ. ద్రావకలబ్ధశక్తికిని దావల మై తగ నిందునందు వా
ర్తావివిధార్థవైఖరులు వ్రాయు తదద్భుతలోహతంత్రి శ్రే
ణోవిధి నింగిలిష్టారల కోలి లిఖింప శుభంబు దైవ మెం
తో వడిఁ బూనునయ్యుభయతోముఖలేఖినినాఁ గనందగున్.

తే. ఇంగిలీషులు పూన్పు నహీనయంత్ర
మహిమచే సర్వజనులకిమ్మహి సుదూర
బంధుసందేశసపదిలాభంబు గలిగెఁ
బ్రభుసమాడంబరము ప్రజార్థంబు గాదె. 8

## ౨. ధూమశకటప్రకరణము.

చ. నగరి కుపేచి వార్ధికెలనన్ గన రాయపురంబుమ్రోల నిం
పుగ పొగబండ్లొనర్పుటకుఁ బూన్చినశాలలు కొట్లు నిండ్లుము
జ్జగములలేని యంత్రచయసంపదలుం పనిముట్టువస్తువుల్
మిగులనెసంగుఁ జూపఱక మేయతరాద్భుతమావహింపుచున్.

ఉ. వాగుల వ్రంతలన్నడువ వంతెనల న్నవరించి పార్శ్వపుం
భాగములందు మించ నలవల్ రచియించియుఁ గ్రింద దారుసం
యోగముమీఁద నాయసమయోజ్జ్వలపట్టములూన్చి కూ
ర్పఁగా, బాగగు రైలురోడ్డు గనువారికి విస్మయమున్
ఘటింపదే. 2

తే. అచటనొక్క మహాద్భుతంబైన వింత
వంతెన దనర్చు దానిపై సంతతంబు
ప్రజ నడచుఁ గ్రిందితూముల రైలుబండ్లు
పఱచు నది చూడ నద్భుతావహము గాదె. 3

చ. ప్రణుతచతూరథాంగములపై పటుమంటపకూటమందుఁ జ
య్యన నుపధానపూర్ణశయనాసనదర్పణకుడ్యదీపయం
త్రనికరముల్వెలంగ నతిరమ్య వినిర్మితహర్మ్యలీలచే
కొనుఁ బురి రైలుబండ్లు గనుగొన్న నుగన్నులపండువౌఁగదా.

సీ. ఘనఘటాకఠినఘుర్ఘురఘోరనిర్ఘాత
నిర్ఘోషఘోషముల్ నింగిముట్ట
తతముఖోత్తంభితోద్దామధూమస్తంభ
రంధ్రనిర్యద్ధూమరాజి గ్రాల
క్రమపరిక్రమదవక్రక్రాంతదిక్చక్ర
చక్రచంక్రమణముల్ చౌకళింప
ద్రుతజితానిలతార్క్ష్యదుర్నిరీక్ష్యాచింత్య
చిత్రాతివేగ మచ్చెరువుసేయ
తే. ధూమశకటపరంపరల్తూర్ణవేగ
దుర్నివారంబులై పర్వునిర్నిరోధ
వార్షికాంబుదమాలికావళులమాడ్కి
నుభయసంధ్యల నగరికి నుత్తరమున. 5

చ. అమరులు మున్ను దివ్యమహిమాతిశయంబునఁ గన్న దేవ
యానములు దివి న్మనోరయమునం జనుఁ గామచరంబులంచు
విం,టిమియిపుడింగిలీషులు పటిష్ఠతఁ జేసినరైలుబండ్లనే,గుమ
హిమనోజవంబును జిగుర్కొనఁగాఁ బురినద్భుతంబుగాన్. 6

మ. ఉరుయంత్రోజ్జ్వలమైన ధూమశకటంబొక్కండు ముందూ
న్పస,త్వరమై వెన్కఁ దగుల్చు భూరిశకటవ్రాతంబుల న్వా
రిదో,త్కరమున్నిర్భర మారుతంబుక్రియ నాకర్షించుచుం
బర్వుఁ గ్ర,మ్మరఁ జేరుం బురి షష్టియోజనము నౌ మార్గంబు
నానాఁటికిన్. 7

వ. మఱియుఁ దత్పురప్రకాండంబు భూమండలస్వర్గంబగుట నందుండువారల కనుభావ్యంబుగ భవ్యంబులగు నవ్యతర దివ్యయానంబులఁ జేయంబూనుచందంబునం గొందఱు శిల్పశాస్త్రమనీషులగు నింగిలీషులు చిత్రమయంబగు మయమాయనను మేయించి శంబరాలంబనంబగు శాంబరి విడంబించియుఁ గడంగి యతివిచిత్రంబుగ యంత్రంబులు తంత్రంబులు మరలువరలు గీల్లను సొళ్లనుం గిలకలుం బలకలుం గీలుకొల్పి యనల్ప శిల్పకల్పనాకల్పం బాకల్పంబు వెలయ ధూమయంత్రశకటంబులును రుచిరతరయానశకటంబులుం గల్పింప నయ్యేకైకయంత్రశకటంబునకు వెనుక ననేక యానశకట పరంపర మాలికాకారంబుగలం కెలిడి తన్ముఖస్థితయంత్రశకటాంతరాళంబున దహారకుహారంబుతోడం దగవాడు దహానకుహారంబులోన శిలామయంబులగు వెక్కసంపురక్కసి బొగ్గు లగ్గలంబుగ నునిచి పెనిచి యనలంబు దరికొల్పి మరకాఁడొక్కరుం డక్కడ నిల్చి మఱిమఱి మరద్రిప్పఁ దెప్పరంబుగ లోని యంత్రచక్రంబులు కులాలచక్రంబులక్రియ నవక్రవేగంబున గిఱగిఱందిరుగఁ గెరలిగిఱిగొనుచుఁ గరమడరుకరువలిం దవులుకొని రవులుకొనం జిగిమిగుల నెగడుచుం బుగబుగన బుగులుకొని తదగ్ని యంత్రోపరిస్థలోత్తంభితో

త్త్రాన ధూమ స్తంభనాళరంధ్రంబున నుద్దామధూమస్తోమ
రేఖావలయంబులు వెడలి లయకాలవిలయధూమకేతు
భ్రమం బాపాదించుచు నభ్రంకషంబులై నెగయఁ దాదృ
గ్విధయంత్రదహనంబు బహులహేతిచ్ఛటాజటిలంబుగ
భగ్గుభగ్గునం బుట్టి బిట్టెగఁదట్టి దట్టంపుమంటలు పెట్టిదంబుగ
నెట్టుకొనంబట్టు యాచుట్టునుం దొట్టిలోనం బట్టిన నెగఁ
దొట్టు నుదకపూరంబు గ్రాఁగి తెకతెకనుడికి మసలి వెసరుల
పసం గసరెత్తి దిగువాఱముసురుకొను నావిరి వావిరింగావిరి
కొని తీవరంబుగ వానికిన్వెన్క నూల్కొలిపిన కుబ్జయంత్ర
స్తంభనాళద్వారంబులం బోవఁ దదుద్దామ దహనదాహాతి
రేకసంతప్తసలిలసంక్షోభసహకృతధూమోద్గమన రభసభవ
మహాబలరయవశంబున సుప్తోత్థితంబునందంబున జడం
బయ్యుఁ జేతనంబు పగిది మెల్లన నావించుచుం గదలి
బొదలి నీల్గి నిక్కి సాగి జరిగి క్రమవిజృంభితంబై నగర
సౌధగాపుత్మతరత్నప్రభాప్రతిఫలనంబునకు జడిసి కడలి
వెడలి వదనంబున విషానలార్చులు పేర్చ మిగులనూర్పుచు
బుసకొట్టుచుం బఱచు మహాద్భుతభుజంగంబుభంగి నేతు
సురంగంబులు దూఱివెడలుచు బడబానలస్ఫులింగంబుల
మునుకొని ఘూర్ణిల్లుచుఁ బశ్చిమాకూపారంబుఁ జేరంబాఱు
పూర్వసాగరాభంగ సముత్తుంగ తరంగ భంగికాపరంపర
వడువున నిమ్నోన్నతాభోగభాగవిభాగంబు లెఱుంగనీక
పుడమిం బర్వుచు జలధిజలంబులు మిగులఁ గ్రోలి తత్సలిలాతి
భారంబున నెగయంజాలక నేలపరువుగఁ బరువెత్తువిద్యు
ల్లతావలయితాననస్ఫీతంబులగు జీమూతంబులభాతి నతి-

గభీరమధురంబుగ గర్జిల్లుచు నూర్జితంబుగఁ బవనజవంబున నానాఁటికిఁ ద్రింశద్యోజనాయామంబు పఱచి యెడనెడ నిలుప నిలుచుచు మరల మరద్రిప్పఁ దత్క్రమంబునం గ్రమ్మఱ నాపురంబుఁ జేరుచుండు మఱియును. 8

తే. రైలురోడ్డుల రేలఁ గంబాలమీఁదఁ
జిత్రవర్ణప్రదీపము ల్వెలువుగాంచు
నగ్ని తన చిత్రభానువిఖ్యాతి వెలయ
బహులరూపాకృతులు పూని పరఁగె ననఁగ. 9

ఆ. రైలురోడ్డునందు రహినందునందుఁ గం
బములకొనల వ్రేలు ఫలకయుగము
రైలుబండ్లు గదల వ్రేలుచు దిగజాఱు
వెసఁ దదాగమైకపిశునమగుచు. 10

### 3. వైద్యశాలాప్రకరణము.

తే. ఆపురికి నుత్తరమున వప్రాంతికమున
సకలలోకహితార్థ మాజాతిదొరలు
ప్రీతి నిలుపఁగ నొక్క యాస్పిటలు వెలయు
బహువిధామయపీడితప్రాప్యమగుచు. 1

### ౪. ఉత్తరశాఖానగరప్రకరణము.

తే. చెలఁగుఁ జాకలపేట సంజీవరాయ
పేటయును గత్తివాక కాలేటిపేట
యొరణపురి తిరువట్టూరు మఱియు రాయ
పురము నలతండియార్పేట పురి కుదిచి. 1

## ౫. కాత్యాయనీప్రకరణము.

వ. మఱియు నత్యంతసుకృతకృత్యనిరత్యయసత్యప్రత్యయంబు
లై నిత్యాంకనివాసస్తుత్యంబులు నవ్యత్యయానురూప
రూపాభిజాత్యసాహిత్యంబులు నగుట నావీటికి నపత్యం
బులమాడ్కిఁ జూడ్కికిన్వేడ్కఁ బాటించుచుం దీటుకొని
గాటంపునీటుల నాటుకొను నానాటుపురంబులలోన న్మేటి
యగు కాలేటిపేటలోఁ గారుణ్యంబునఁ గాణపంగ్వంధాది
జనలోకంబులకుఁ గాంక్షితార్థంబులఁ గటాక్షింపఁ గామ
నీయకసులభవిలోకనీయ కమనీయాకారంబు గైకొని కాం
చనప్రాసాదంబునఁ గాఁపున్న కాలకంఠప్రణయినియుఁ గామి
తార్థప్రదాయినియుఁ గాకోదరీగణోద్గీతస్వాపదానప్రపంచి
కయుఁ గాళిన్యాదికళాకాంతయుఁ గాకోలూకాహుతి
ప్రియయుఁ గాకోలభయసంహర్త్రియుఁ గాకలీకలలాపినియుఁ
గాకుస్వరైకసాకూతయుఁ గాకత్రాసకృదర్చితయుఁ గాచ
గోళోజ్జ్వలాగారయుఁ గాంచీదామవిభూషితయుఁ గాచ
స్వర్ణసమానాశయుఁ గాంచీపురనివాసినియుఁ గాంచనాచల
శృంగస్థయుఁ గాచిదిత్యభిధోచితయుఁ గారవల్యాదికస్తు
త్యయుఁ గాణపంగ్వాదిపోషణియుఁ గాణాదప్రముఖాశేష
శాస్త్రపాండిత్యదాయినియుఁ గార్తికేయప్రజననియుఁ గా
ర్తాంతికకృతాదరయుఁ గాత్యాయనియుఁ గాతరాక్షియుఁ
గాతరత్రాణతత్పరయుఁ గాంతాకృతియుఁ గాంతిమతియుఁ
గాంతారైకనివాసినియుఁ గాంతవాక్రీడనాలోలస్వాంతయుఁ
గాంతైకలంపటయుఁ గాదంబరీరసాస్వాదయుఁ గాదివిద్యా
వినోదినియుఁ గాదికషాయవసనార్ణమాతృకామండలాత్మికయుఁ

గాదంబమందగమనయుఁ గాదంబవనవాసినియుఁ గాదంబినీ
కమ్రకచయుఁ గాదర్యైకనివారణియుఁ గాదాచిత్కప్రకోపా
ఢ్యయుఁ గాధివ్యాధిప్రవర్ధనియుఁ గానీనికప్రభాశార
కలితాపాంగవీక్షణియుఁ గానీనరిపులక్ష్మేక్షణోత్సుకయుఁ
గానప్రియయుఁ గాపట్యరహితస్వాంతయుఁ గాపిశాయన
లాలసయుఁ గాపిలాది కళాభిజ్ఞయుఁ గాపాలికసుదుర్గ
మయుఁ గామేశ్వరప్రియాలాపయుఁ గామసంధుక్షణౌష
ధియుఁ గామలీలారసానందలోలయుఁ గామకళాతిక్తయుఁ
గామేశ్వరియుఁ గామ్యమానయుఁ గామపాలసహోదరియుఁ
గామందకాదినీతిజ్ఞయుఁ గామితార్థప్రదాయనియుఁ గామి
కాద్యాగమాభిజ్ఞయుఁ గామిలాద్యపహారిణియుఁ గామనా
కామనాతీతస్వభావయుఁ గామచారిణియుఁ గాయికాద్య
ర్చనప్రీతయుఁ గాయశుఘ్యాదిసిద్ధిదయుఁ గారీర్యాదిమఖ
ఫలప్రదయుఁ గారుణ్యవారిధియుఁ గారణాకారణాతీత
యుఁ గారాబంధప్రమోచనియుఁ గారండవాదికలితకాసా
రైకవిహారిణియుఁ గారవల్యాదిశాకైకరసికయుఁ గారికాస్తు
తయుఁ గాలాంబుదసమాభాసయుఁ గాలదూతభయంక
రియుఁ గాలేయపంకదిగ్ధాంగియుఁ గాలకంధరకామినియుఁ
గాలాగురుప్రధూపైకప్రియయుఁ గాలస్వరూపిణియుఁగావే
ర్యాదినదీరూపయుఁ గాశీనగరవాసినియుఁ గాశజాధిష్ఠిత
స్వాంకయుఁ గాషాయాంబరధారిణియుఁ గాసశ్వాసాది
హారిణియుఁ గాసరాసురమర్దనియుఁ గాహలీకమనీయోరుజం
ఘయుఁ గవిరాజితయుఁ గాళరాత్ర్యాది సహితయుఁ
గాళియాహ్యహితానుజయుఁ గాళిందిజలకల్లోలకేళికయుఁ

గాళికాహ్వాయయుఁ గాంక్షితార్థప్రదాయినియు నగు
కాత్యాయనీమహాదేవినిం గాంచినఁ గాలుష్యంబులు కాంది
శీకంబులుగావె మఱియును. 1

మ. అలరారుం బ్రతిశుక్రవాసరసపర్యారంభముం దాహిమా
చలకన్యామణిగేహసీమనసకృత్స్వస్తికస్వస్తియుక్
లలితానామసహస్రపూజజనితోల్లాసంబు దీపోత్కరం
బులుతౌర్యత్రికముల్ ప్రజాకలకలంబుల్దుందుభిధ్వానముల్.

మ. భృగువారోత్సవదర్శనోత్సుకత నారీపూరుషు ల్మల్లికా
ప్రగుదంచత్కచహారులై నడతు రోజం దత్పురద్వారమా
దిగ నాకోవెలముట్ట దట్టముగఁ దద్దేవీకృపావృష్టి దె
ల్పఁగ నౌసాండపిపీలికావళులలీలన్ రథ్య నిండారగన్. 3

ఉ. వీటివధూటు లెక్కనతివేగచలచ్ఛకటచ్ఛటాళులా
హాటకశైలచాపధరునంగనఁ గన్గొనవచ్చు యోగినీ
కోటిరథంబులట్టులరుగున్వడిఁ జాకలిపేట తండియా
ర్పేటలవీథులందు నిబిరీసములై భృగువాసరంబులన్. 4

క. కుంకుమనిరంకుశార్చా
లంకారముగాంచి నిష్కళంకద్యుతినా
శాంకరి శశాంకశేఖరి
యంకురితకృపారసాంకురాకృతిఁ బొల్చున్. 5

తే. అనఘ సౌభాగ్యమారోగ్యమాత్మభవుల
నభిలషించి వధూలోకమలమి కొలువ
నమ్మహాదేవిభవన మింపారు నెపుడు
వరవధూమయమన శుక్రవాసరముల. 6

## ౬. త్యాగరాయప్రకరణము.

మ. తిరువత్తూరునఁ ద్యాగరాజపురజిద్దేవాలయంబొప్పు శం
కరశైలంబయి కూటకందరతటాకారంబు ప్రాకారగో
పురశాలాగృహమంటపంబులు గనం బొల్పారు కోనేరు భా
స్వరమౌ మానసపంకజాకరమునై భాసిల్లు భావింపఁగన్. 1

తే. భక్తజనులకు వాంఛితవరము లొసఁగి
పెక్కు కృతులంది సత్కీర్తిఁ బేరుగాంచు
త్యాగరాయాఖ్యదేవుఁ డం దధివసించు
నలవియే తిరువట్టూరుచెలువు పొగడ. 2

పంచచామరము.—

ఋజుత్వమద్రిదిష్ట సత్కర ప్రహృష్టసప్రజోల్లస
త్ప్రజాప్రజోజ్జ్వలద్వసంతవాడరాజ్యధూర్వహా
ధ్వజస్ఫురద్గజాశ్వపూర్ణధాటికారిదుస్సహా
భుజాభుజంగరాజభోగభూగభూసుఖావహా. 3

గద్యము. ఇది శ్రీమన్నాల్యశైలనృసింహప్రసాదసమాసాదితసకల
శాస్త్రసంవిదుపస్కృతసంస్కృతాంధ్రసాహితీపురస్కృతసరస
సారస్వతచతురవాగ్ధోరణి మతుకుమల్లికులమతల్లి కావ్యవల్లి కా
వియన్మణి కనకాద్రిశాస్త్రిబుధగ్రామణితనూభవాగ్రణి
నృసింహావిద్వన్మణిప్రణీతంబగు చెన్నపురీవిలాసంబను ప్రబం
ధంబునందుఁ బంచమంబగు నుత్తరపద్ధతి సంపూర్ణము.

శ్రీ ర స్తు

# చెన్నపురీవిలాసము

## షష్ఠంబగు నంతరాళపద్ధతి.

---

### ౧. ముద్రాక్షరశాలా ప్రకరణము.

శ్రీమద్వసంతవాడ
గ్రామస్థితవేంకటేశ్వరఖ్యాతహరి
స్థేమ పటుభక్తినిర్మిత
భూమశిలాధామ నాగభూపలలామా. 1

వ. అవధరింపుము. 2

మ. పురి ముద్రాక్షరశాలికానికర మొప్పున్యంత్రసంకీలితా
క్షరభాస్వద్వసుకోశసంతతికళాకాంతుల్పరీక్షింప నా
దర మొప్పన్విబుధాధినాథులు నితాంతప్రౌఢి రక్షింపఁగా
నరుదారన్మహిఁభారతీమహితభాండాగారసంభావనన్. 3

సీ. విద్యానిలయమాదివిద్యానిలయము క
ళానిధి జ్యోతిష్కళానిధియును
శారదానిలయంబు జ్ఞానసూర్యోదయం
బునలసూర్యాలోకమును సరస్వ
తీనిలయంబు నాదిసరస్వతీనిల
యంబు వివేకరత్నాకరంబు

నన వివేకాదర్శమన వర్తమానత
రంగిణియుననంగ రమణఁ జెందు
తే. నందు హిందూప్రక్షిప్తముద్రాక్షరాల
యము లశేషమనీషిజనాభినంద్య
మానవిభవాన్వితంబులై మాననీయ
శారదాటంకశాలికాచారురేఖ. 4

మ. జను లెన్నం దినవర్తమానియును బోర్ట్సెంట్జార్జిగెజెట్క్రిగిం
టనమిష్నరియునాఁగ మెచ్చనగు నచ్చాఫీసు లాయింగిలీ
షునృపన్యస్తములప్పూరేందిరతనుం జూడంగ నేతెంచుమా
తృనికాయంబునకూన్చు నావసథభూరిశ్రీఁ దనర్చుంబురిన్.

శా. ఆముద్రాక్షరశాలలందు మహితంబౌ తండియార్పేటస
ద్ధామం బాదిసరస్వతీనిలయముద్రావర్ణసద్మంబునా
యామశ్రీ విలసిల్లుఁ దత్పురిఁ దదధ్యక్షుండు వావిళ్లస
ద్రామస్వామివిపశ్చిదగ్రణి ప్రసిద్ధప్రఖ్యఁ గాంచుఁ ధరన్. 6

శా. శ్రీమత్పావనబొమ్మదేవరకులక్షీరాబ్ధిరాకాసుధా
ధామశ్రీయగు నాగభూపతి జగత్ప్రఖ్యాతిగా వీట నా
రామస్వామిమనీషిచే నిఖిలసద్గ్రంథాళి ముద్రింప లో
కామోదంబగునట్లొనర్చె దనసాహాయ్యంబువాటించుచున్.

## ౨. హూణదేవాలయప్రకరణము.

క. అభ్రంలిహాశిఖరములు వి
శుభ్రసుధాలేపవిభవసుభగములు మహా
విభ్రమములు పాదురులయ
దభ్రములగు గుడులు పర్వతభ్రమదంబుల్. 1

చ. గములయియాదివారముల గాఢపుభక్తి మదిం దలిర్పఁగాఁ
భ్రమదలతోడఁ గూడి నిజభావములన్నకలేశ్వరున్విభుం
శమదమయుక్తి ధ్యానములు సల్పుదు రెప్పుడు నన్యకార్యవి
భ్రమరహితాంతరంగులు పరంగులు పాదిరిగుళ్ల నప్పురిన్.

### ౩. ఫోటోగ్రాఫీ ప్రకరణము.

శా. ఛాయాగ్రాహిణి యాంజనేయునితనుచ్ఛాయన్వడిన్నిల్పితా
డాయందీసెననంగ వింటిమది చూడన్యంత్రపేటిన్ ఘన
ప్రాయాదర్శములందు నీడలఁ బొటోగ్రాఫీక్రియన్నిల్వఁగాఁ
జేయం జాలిరి యింగిలీషులు పురిం జిత్రాతిచిత్రంబుగన్. 1

చ. నలువయొనర్చు సర్గము వినశ్వరమంతకుమున్నె యాశునా
శులు ప్రతిబింబవైఖరులఁ జూడఁగఁ దాదృశబింబలీలల
న్నిలిపిరి హూణులద్దముల నిత్యముగా ధృతినట్టిశక్తిపెం
పలరఁగ బొమ్మదేవరవరాన్వయనాగవిభుండు చేకొనెన్. 2

### ౪. ఇలెక్ట్రోగేల్వానిక్మిషన్ ప్రకరణము.

మ. శ్రమమీఱన్సకలప్రజాంగకములన్సంధిల్లు వాయువ్యథ
ల్శమియింపంగ జగద్ధితార్థము ప్రశస్తప్రౌఢి యూరోపులి
ట్లుమహాయత్నమున న్రచించిరి యిలెక్ట్రోపేటునవ్విద్యన
శ్రమత న్నేర్చె జగజ్జనోపకరణేచ్ఛ న్నాగభూజానియున్. 1

వ. మఱియు నాయిలెక్ట్రోగేల్వానిక్మిషనను వైద్యవిద్యకు విద్యోతకంబగు నొక్కయంత్రపేటియు నందు ద్రావకప్రపూర్ణంబులగు కాచపాత్రములు రెండును వానిలో న్యస్తంబై యంత్రకీలితంబగు తంత్రీద్వితయంబును గలిగియుండు నాతంత్రీప్రకారంబు. 2

తే. ద్రావకన్యస్తతంత్రులఁ గ్రమముతోడ
జరుగు నాకృష్టిశక్తి యుత్సర్గశక్తి
యొకటిఁ బట్టిన రభస మించుకయు లేదు
నుభయము గ్రహింపఁ బరఁగు నత్యుల్బణముగ. 3

ఉ. కాయములోని ప్రాణము పెకల్చు మహాలయకాలకాలకా
లాయసకాలపాశమున కచ్చుపునెచ్చెలి సర్వదేహభృ
త్కాయనికాయమందుఁ గలధాతులు పీల్చెడిమారిజిహ్వకుం
బాయనితోడునీడయగు భారపుతంత్రిని ముట్టశక్యమే. 4

తే. కందురీఁగెల యొకకోటి గఱచినట్లు
కూడి వెయిమంద్రగబ్బలు కుట్టినట్లు
దాక మ్రోచేతికిని దెబ్బ దాఁకినట్లు
తల్లడిలు ప్రాణములు తంత్రిఁ దాఁకినంత. 5

తే. తేలుకుట్టినవెత కొంతదేహమంద
జనుల బెదరించుకైవడి ఝూంకరించు
తంత్రి నంటినమాత్రఁ జిత్రంబుగాఁగ
జలజలన దేహమందెల్ల జలదరించు. 6

తే. ఎక్కుడగువింటిచే దూది యేకినట్లు
గులగులన రక్తమాంసముల్కుదురు గదలఁ
బల్లటిలుఁ బ్రాణములు మేను జల్లురనఁగఁ
దీఁగెదోయి కరద్వయి లాఁగునపుడు. 7

౯. పెద్దినాఁగునిపేటవీథీప్రకరణము.

వ. మఱియు నాపెద్దినాయనిపేటలోనం దద్దయు నిద్దంపుపద్దుల
నొద్దికగొని త్రిదివంబునకు నుద్దియగు నాపెద్దవీథియు నెంబడ
పిళ్లారిగుడి వీథియుఁ దండులాదిద్రవ్యంబులు నిసుము మొద

లగులోహంబులు మందులునుం గంధద్రవ్యంబులునమ్మునం గడులును స్కందస్వామియనువేలుపుమందిరంబును నతిసుందరంబులగుఘూర్జరాపణబృందంబులు నమందాశేషవిపణికాసందోహంబులునుం గలిగి చెన్నొందు పెద్దయంగడివీథియుం బ్రవిసారితనానావిధ వివిధవిచిత్రచేలానీకలోచనాసేచనకంబగుకోకలవీథియుం బెరట్టుకందంపిళ్లారిగుడికి నెలవగు నయ్యంపిళ్లవీథియు నరుణాచలేశ్వరాలయోపహిండితంబగు నిరిశాండిసుబ్బిసెట్టివీథియు నేకామ్రేశ్వరోన్నమ్రకమ్రభాస్వరకార్తస్వరస్తంభరేఖా వికస్వరప్రభారుచిరసౌధరాజంబునకును నడిపట్టపిళ్లారిగుడికినింబట్టగు గుజరాతీవీథియు నేకపార్శ్వభవనభాసురంబగునొత్తవాడవీథియు సీలిపొన్నపిళ్లవీథియు నాభీరజనవల్లభంబగు వల్లభదొడ్డివీథియు నున్నిద్రవిభవభద్రంబగు వీరభద్రభవనంబునుం జెంగామంగడియుం జిన్నయంగడియుం బిళ్లారిగుడియునుం గల్గి పెంపొందు గోవిందప్పనాయనివీథియు వినూత్నరత్నకాంతిచ్ఛటామంజులామూల్యనానావిధాభరణసువర్ణముద్రికాప్రాజ్యంబగు వాణిజ్యంబుచేఁ బూజ్యంబగు మందవెళివీథియు బ్రాక్ష్టూరిస్వీథియుఁ బారిషీ వెంకటాచలయ్యవారివీథియు వరదాముత్తియప్పనివీథియు నరుణాపిళ్లవీథియు యుగాంతమ్మగుడివీథియు మన్నడివీథియు మొదలగువీథులం బ్రసిద్ధినొంది యుండు నందుఁ బెద్దవీథియందు. 1

## ౭. సప్తమోపప్రకరణము.

మ. పురి వప్రావృతకూపసప్తకజలంబుల్ ఘటీయంత్రసం
సరణోన్నీతములై దరోదరనివిష్టస్ఫారనాళావళీ

పరణిన్లోపలికోటఁ జేర నట సోల్జర్లున్ దొరల్తద్భటో [న్.
త్కరముల్ద్రావుదురందునందు జలయంత్రస్తంభరంధ్రంబున

చ. లలినలయేడుబావులజలంబు లిలాంతరలీననాళికా
వలిమిళితంబులై నడచి వారిధితీరమునందు నొక్కయు
జ్జ్వలజలయంత్రకుండి నిలువన్బహుదూరయియాసులౌసరం
గులుగొని యోడలందు జలకుండలు నింతురు నిచ్చనిచ్చలున్.

## ౨. పుష్పకూపప్రకరణము.

తే. ఏడుబావులదొడ్డికి నినజుదెసను
బూలబావులునా మూఁడు పొలుపుగాంచు
వీటఁగల సకలప్రజాకోటికెల్ల
నాజలంబులె పానయోగ్యములు దలఁప. 1

మ. పసుపుచ్ఛాయనిగ్గులంగములపైఁబైఁబర్వఁ దాంబూలపుం
బసపుక్కిళ్లకు నిక్కవన్నెగలవల్వల్గట్టి పూదండలిం
పెసఁగంగొప్పులఁ జంకబిందెచనుదోయిన్రాయఁదత్కూపవా
రిసతుల్దెత్తురు గుంపులై నగరిదారిం జూడ్కికిన్వేడ్కగాన్.

శా. ఆకూపంబులఁజుట్టు రేయుఁబగలత్యాశ్చర్యసంమర్దమో
హో కన్పట్టును వేయుచేఁదమఱితీయుం జేఁదయున్మున్నము
న్వేఁకం జేఁదఁగఁబోవువారు మఱియున్నే ముందు నేముందటం
చాకారించెడివారలై జలము తీయ న్సందడుల్సేయగన్. 3

చ. పొలుపుగఁ బుష్పకూపజలపూర్ణఘటంబులు దొంతిగా శిరం
బుల ధరియించి యయ్యరవబోటులు వీటను మేటివీటుకు
ల్కుల నరుదెంతు రాత్మజితకుంభసమున్నతికోర్వకాగ్రహో
చ్చలనము గాంచుభంగి బిగిచన్గవ పయ్యెదమీఱనిక్కఁగాన్.

### ౮. జంబూరాతోఁటప్రకరణము.

క. జంబూరాజియుతంబగు
జంబూరాతోఁటలోఁ బసఁబరంగులునో
జంబూరాయిడఁ బురరా
జంబూరాడంగ నిల్పు సఖులనఁ గదరే. 1

### ౯. టంకశాలాప్రకరణము.

ఉ. ఆపురి టంకశాలవరణాగ్రవిటంకవిశంకటాభిత, స్థాపిత
కాచశంకుభయదంబు కఠోరకవాటకూటము,ప్రాపిప మనేక
హయాణభటవర్గబహుప్రతిహారిగుప్త మా, లోపల నొప్పు
యంత్రగృహాలోహాగృహాయుధకూటకోశముల్. 1

క. ఆటంకశాలనెపుడు ని
రాటంకత నొప్పు రౌప్య హాటక తామ్ర
శ్రీటంకపరికరైకమ
హాటంకోటంక టాంక్రియాఘోషంబుల్. 2

చ. ఒదవఁగ: ద్రుప్పుబిట్టు చిలుమూనిన ప్రాఁచిధనంబుఁగల్గుతో
మ్మిదినిధులొప్పు నాధనదు మేటిగృహం బది యెంత తత్పురిఁ
బదపడుఁ డంకశాలలనపావినూతనపుఁజితాన్వహా
భ్యుదిత సువర్ణతామ్రరజతోద్యద నేకసుముద్రికానిధుల్.

తే. బీరపువ్వులఁ బోలు దీనారసమితి
రిక్కరేన్నోలు రౌప్యముద్రికలగములు
కర్ణికారాభతామ్రటంకవ్రజములు
రాసులై టంకశాలల రమణఁ గాంచు. 4

మ. అతిదీర్ఘం బతిపీవరంబు నిబిడం బభ్రంలిహాగ్రోద్ధితా
తతధూమంబయి చిత్రమై యనలయంత్రస్తంభనాళాంతరై
భృతికత్తైకవినిద్ర వాస్తుపురుషాపీతాననోత్తంభితా
ద్భుతవృత్తాయత ధూమవర్తియన నొప్పుం డంకశాలాస్థలిన్.

### ౧౦. ఘూర్జరవీథీప్రకరణము.

మ. గుజరాతీలును బొందిలీలును ననేకుల్మారువాడీలు బే
రజపుంబేరపు నేర్పు లేర్పడ ననర్ఘ్యద్వైపనానామణి
వ్రజభూషక్రయవిక్రయంబులు నొనర్పం బొల్పగు న్సౌధ
రాజిం జెలంగుం గుజరాతివీథి ధనలక్ష్మీనిత్యసంవాసమై. 1

చ. అనువుగ గుబ్బచన్నుగవ నంచులు మూయఁగ రత్నకంచుకు
ల్దనరఁగఁ దాల్చి వేణులు నితంబతటంబుల వ్రేల సావకుం
తనలయి సౌధమండలవిటంకములం గననైరి ఘూర్జరాం
గనలు విమానగానిమిషకాంతలునా గుజరాతివీథిలోన్. 2

### ౧౧. మందవెళివీథీప్రకరణము.

చ. పనిగొనకుండ మూల నిడఁ బ్రాఁతపడున్నల మేమటంచు పె
న్గనుల ధనంబు పెంపుగని నవ్యత మించఁగ బేరమూన్ప నా
ధనపతి పెక్కురూపములు దాల్చెనునాఁగ వణిగ్జనాళి మే
ల్వినుతి వహించుమందవెళివీథిని రత్నమయాపణంబులన్. 1

ఉ. ఆపుటభేదనంబునకు నాభరణస్ఫురణంబు పూన్చుర
త్నాపణరాజిలబ్ధపణయత్నవినూత్నచిరత్నరత్నపా
ళీపటురాసు లుల్బణపునీలఁ దనప్పును వారిరాశియా
త్మోపగరత్నలక్ష్మి పురియొద్దను దాఁపఁగనుంచెనో యనన్. 2

చ. విరివిఁ దనర్చు మందవెళివీథిసరాబులు నాపణంబులం
బరచుననర్ఘ్యరత్నరుచిభాస్వరభూషణపుంజముల్మనో

హారనగరీగృహేందిరలకర్థిపృథగ్గతిరత్నగర్భభా
సురముల నేడువారముల సొమ్ములనీనెనునా సిరుల్లనున్. 3

## ౧౨. సుగంధద్రవ్యపణ్యావీథీప్రకరణము.

తే. దీర్ఘతదగణ్యపణ్యవీథీప్రసృమర
సంకుమదకుంకుమాగురుచంద్రనామ
మృగమదామోదము వహించి మెలఁగుకతన
ననిలునకు గంధవహాత యన్వర్థమయ్యె. 1

## ౧౩. పెద్దయంగడివీథీప్రకరణము.

మ. పుడమిన్వేడ్కలు చూడఁగోరినయెడం బొల్పారునా పెద్దయం
గడివీథిం దగఁ గన్గొనన్వలయు లోకఖ్యాత మవ్వీథి యే
ర్పడ నానావిధచిత్రవస్తుచయపూర్ణశ్రీ లనేకంబులం
గడులుండన్వెలయుఁ దద్వితీయజనలోకంబున్విడంబించుచున్.

## ౧౪. గుజిరీవీథీప్రకరణము.

మ. గుజిరీవీథిని గుంపుగుంపులు పరంగుల్పొందుపుల్బల్గొర
ల్పొజ వేడ్కంగన నెక్కుసారటులు తీవ్రంబౌరయంబారఁగా
గుజిరీవేళఁ బరిభ్రమించు జనవద్ఘోట్టాణఘోరార్భటిక
గజిబిజల్గొని యందు నంగడుల లోకవ్రాతమట్టాడఁగన్. 1

చ. పెళపెళలీనగంజిబిగివిం కుబుసంబులు మేను గప్పియం
చుల జగజంపులిప్పుగనిచుట్టు దెసల్పరవంజనేలపై
నెలమిని జీరువారవెసనీతలు మ్రోతలుగాఁగఁ బాదచా
రలయి చరింతురచ్చటఁ బరంగివరాంగులు సంజవేళలన్. 2

మ. మరుదుల్లోలితఫుల్లకాశవనసామ్యంబొప్పఁగా సాంద్రబం
ధురపౌరౌఘము సర్వతోముఖసరత్కోలాహలోన్నిద్రమై
యరుదారంగఁ జరించునందు గుజిరీయంగళ్ల నిందూదయో
త్సరదూర్మిస్ఫురదంబురాశికిఁ బ్రతిద్వంద్వస్థితిన్సంధ్యలన్. 3

ఉ. దొంగలభంగురద్రఢిమ దొంగిలదొడ్డలునా నడంగి ప్రే
ల్వెంగులముళ్లు కత్తెరులఁ జించి పడిన్నటుమాయ సేయు నా
యంగడులందు పోలీసులారసి దండన సేయుచుంద్రు వా
రింగడు దాన దొంగగుజిరీయనఁగా నొకపేఁరు దానికిన్. 4

చ. బడిబడిఁ బిల్చి తియ్యనగుపల్కుల నమ్మిక పుట్టగా వెల
ల్గడుసుతులంటఁ దెల్పిజనఁగాలిడ బేరములందుఁ గూర్చుచుం
గడుసుతనంబు హేళనము గానగుచుం జిరకొట్టివైశ్యులం
గడులను మోసపుచ్చుదురు గ్రామ్యతతింబితలాంట మేర్పడన్.

## ౧౫. కోకలవీథీప్రకరణము.

మ. అతిరమ్యంబగు చెన్నకేశవగృహం బాచెన్నమల్లీశ్వరా
యతనంబుం బటవీథినీలకలశోదారాగ్రతం గూడి యా
తతశోభాఢ్యపురీవధూపృథుకుచద్వంద్వభ్రమం బూన్చుశో
భితమౌ తన్నికటస్థ దీర్ఘికయు నాభివిభ్రమంబుంగనున్. 1

## ౧౬. ముత్యాలపేటవీథీప్రకరణము.

వ. మఱియు నత్యంతవైచిత్ర్యశ్రీస్తుత్యంబగు ముత్యాలపేటలో
కాళికాభవనపాళికారుచిరంబును మల్లీశ్వరప్రసాదమహి
తంబును దీర్ఘశిలాస్థగితదీర్ఘికానర్ఘ్యజలౌఘశ్రీ ప్రీణితాం
తర్ఘస్రేశ్వరంబును నగు పెద్దవీథియు వివిధవిద్రుమవార్ధు
షికహర్మ్యసుభగంబగు పగడాలవీథియుం గృష్ణునిగుడి

వీథియు నట్టపాళెమువీథియు వీరపిళ్లవీథియు ససంభ్రమ
సరభసభ్రమద్భ్రమాలతిలయంత్ర సవిభ్రమభ్రమీప్రభవనిర్భ
రాభ్రతలోత్సర్పదభ్ర ఘటాదభ్ర గర్జాభ్రమదఘనారావ
ఘూర్ణితంబగు గాండ్లవీథియుఁ గ్రొత్తవీథియుఁ బట్టుకాళ
ప్పమొదలివీథియుఁ గప్పలోప్పిలిసెట్టివీథియు నాగప్ప
మొదలివీథియు నైయనందగు నేయికార పొన్నప్పసెట్టి
వీథియు సమగ్రవిద్యా నిరవగ్రహంబును వివిధద్విజపరి
గ్రహంబును నై తన్నగరరాజకంఠాగ్రహారంబగు కృష్ణప్ప
నాయనియగ్రహారంబును శక్రపురీసదృశంబగు శక్రసెట్టి
వీథియుం గట్టకారయారుమొక మొదలివీథియుం గారుజనా
కీర్ణంబగు కారకుపేట వీథియుం బార్కుసువీథియు వీరసామి
పిళ్లవీథియు వెంకటమేస్త్రీవీథియు భేరీవణిగ్జనాస్పదంబులగు
తంబుసెట్టి లింగిసెట్టి ముత్తుమారిసెట్టులవీథులును లబ్బల
వీథియు వేశ్యా జనాధికాలోకనీయంబగు నోడకాలు
వీథియు నుత్సవావసరవిమానకాయమాన వితానవిలంబ
మాన వివిధకాంస్యపాత్రికాలంకృతంబు నత్యుచ్చంబు
నగు కచ్చాలేశ్వరుని గుడియు విమలసలిలపరిష్కారిణి యగు
పుష్కరిణియుంగలిగి యమరు నరమనవారివీథియు రామ
స్వామివీథియుఁ బెద్దపాళమ్మ యనుగ్రామదేవతగుడియును
గజవదనసదనంబునుం గుదురుకొన రమణీయంబగు నయ్యప్ప
సెట్టివీథియు సెంగళునీరుపిళ్లారిగుడివీథియు హూణజన
సందోహమందిరసుందరంబగు నైనియప్పనివీథియుఁ దాదృ
శంబులగుశంభుదాసు శౌరిముత్తు మలయప్ప యప్పూమేస్త్రి
దైమిన్నుజైమిన్నుల వీథులును సమస్తప్రశస్త నిస్తులాస్తోక

వస్తువిస్తారశ్వేతకాయవార్ధుషికనికాయవాణిజ్యసౌధ మంట
పవిశాలం బగు పాపమ్మవీథియుఁ బిడానిగుడివీథియు
నమ్మవారుగుడివీథియు నచ్చారప్పనివీథియు నాండియప్ప
మేస్త్రి వీథియు వెంకటాచలమొదలివీథియుం ద్యాగరాయ
పిళ్ల వీథియు నిరిశప్పమేస్త్రివీథియును నుత్తుంగతరాభంగ
శృంగశృంగారమేదురాది కేశవహరిభవన మంగళంబగు
మంగమ్మవీథియు ముక్కుముత్యాలమొదలివీథియు పార్థ
సుబ్బరాయమొదలివీథియుఁ బెడగుంట్లవీథియు సూతభవ
నంబులచే దట్టంబై ధర్మరాయదేవసదనంబునకుం బట్టగు
మిట్టవీథియు మారుకట్టునుంగలిగియుండు నందు. 1

## ౧౭. కచ్చాలేశ్వరప్రకరణము.

శా. కచ్చాలేశ్వరునాలయాంతరమునం గన్పట్టుదీపచ్ఛటాం
చచ్చారుచ్ఛవిఁగాయమానములపంచల్ ప్రేలునచ్ఛాచ్ఛతో
ద్యచ్చిత్రద్యుతిమించుకంచముల సాంద్రచ్ఛాయజానూనవి
ద్యుచ్ఛక్రాభ గనం దదీశ్వరునిచిజ్జ్యోతిర్మయత్వప్రథల్. 1

మ. నిబిడాలంకృతపుష్పదామకములున్మీలద్వితానాగ్రలం
బబహుస్ఫారవిచిత్రకాచమయదీప్యద్దీపయంత్రచ్ఛటా
స్తబకంబుల్కదళీప్రకాండఘటితస్తంభంబులై పందిరుల్
ప్రబలుం దద్విభునుత్సవంబులఁ దలంపం బుష్పకప్రక్రియన్.

## ౧౮. పగడాలవీథిప్రకరణము.

మ. పొగడొందుం బగడాలవీథి నగరిం బొల్పారి ముత్యాలపే
టఁ గళాకల్పమునా ననల్పగృహకూటస్ఫారశాలోచ్ఛ్రసా

ధగణాకీర్ణము భూరిపోతవణిగుత్తాలప్రకీర్ణార్థరా
శిగరీయస్తరమై ధనేశ్వరఘనశ్రీమన్ని వాసాకృతిన్. 1

### ౧౯. డ్రైమిస్సుజైమిస్సువీథుల ప్రకరణము.

మ. వెలయన్ బుట్టలబోలిమస్తముల టోపీలొప్పఁ జిత్రంపుబొం
తలునెమ్మేనులు గప్ప లాగులు పదద్వంద్వంబులోఁ జేర్పవే
డ్కలు సేయుం పురి శ్వేతకాయచయమా డ్రైమిస్సుజై మిస్సువీ
థుల నంభోనిధిఁ బాసి యందలరుపాథోమానుష ప్రక్రియన్.

### ౨౦. వేశ్యా ప్రకరణము.

శా. ఇంపున్సొంపును బెంపుసంపదనిలింపైణాక్షులగ్గింపఁగా
శంపాభల్విలసన్నఖంపచకుచల్పాంపేయనాసల్పల
ర్ఘుంపాతాళమనోజ్ఞనాట్యభరతాచార్యస్తుతశ్రీలసూ
ర్యంపశ్యల్పురి వేశ్యలుందురు ఘనంబౌ నోడకాల్వీథిలోన్.

సీ. పెదవి మెదల్చిరా మృదులపల్లవరాగ
తుముల మరందబిందువులు చిందుఁ
గన్నులల్లార్చిరా కమలకాండోజ్జ్వలో
త్పలశిలీముఖ విభావములు గురియుఁ
గాలుకదల్చిరా కలహంసకక్వాణ
కమనీయలాస్యవైఖరులు నెరయుఁ
గేలుమలంచిరా కిసలయాంబుజకోశ
లీలాభినయసముల్లేఖలలరు

తే. మేను మెలఁగించిరా సరసానుబంధ
రతిమనోజ్ఞాంతరంగహారములు వఱలు
వెలయుతత్పురి నోడకాల్వీథిలోనఁ
జెలఁగువెలయాంధ్రు స్మరజయశ్రీలు గారె. 2

మ. లలితామూల్యతనూవిలాసగుణజాలంబు ల్ప్రసారించి యు
జ్జ్వలనై పథ్యమనోజ్ఞవిభ్రమము నెంచందీముఁ గాఁగూర్చియా
వలితాపాంగశిలీముఖావళి యువవ్రాతంబు వేఁటాడున
ట్లలరు న్సంజల నిల్చి వాఁకిళుల వేశ్యావార మవ్వీథిలోన్. 3

మ. కలగానామృతవృష్టిఁ గంబములు శాఖాపత్రపుష్పచ్ఛటా
కలన న్మించఁగ లాస్యవిభ్రమకలాకల్పంబుల న్సభ్యు లు
జ్జ్వలచిత్రాకృతిఁ బూనఁ జేయుదు రుదంచల్లీలనవ్వీటవే
శ్యలు నానాసభల న్మనోభవుని మాయామంత్రశక్తుల్బలెన్.

## ౨౧. రాక్షసాంగారప్రకరణము.

తే. పురిని ముత్యాలపేటకుత్తరమునందుఁ
గోటక్కడ రాక్షసాంగారకూటతతులు
కొండలననొప్పు తన్మషీఘోదకలనఁ
బుడమి నీలాంబరియనంగఁ బొలుపుగాంచు. 1

## ౨౨. కప్పలపోలిసెట్టివీథీప్రకరణము.

మ. ప్రణుతింపందగియొప్పునప్పురిని గప్పల్పోలిసెట్టప్పవీ
థినినాముత్తెపుపేటనాభియనబందీ గ్రామముల్చేసికా

రొక్కనుటాటోటులు జారులుంగలహాకారుల్లోనుగాఁబట్టి మే
ల్గనుకొత్వాలుది కొల్వుకూట మది సాకూద్దండనీతిస్థితిన్. 1

చ. చలిగొను చేమ గోగవిసిశాకిని ముస్గయు మెంతిచుక్కబ
చ్చలులును దోసమావిపనసల్పిటికాకరపొట్ల బీరవం
గలుసొరగుమ్మడుల్కదలికాయలు చిక్కుడుకాయలాదికూ
రఁలుమఱిమూంసముల్పలుదెఱంగులుపొల్పగుమాఁకట్టునన్.

## ౨౩. బందీశాలాప్రకరణము.

పంచపాదిమత్తేభము.—

ప్రకటాటోపభయంకరంబు వికటప్రాకారగుప్తంబుదీ
ప్రకవాటంబు బహిర్వ్యటంకతటలంబప్రాణహృత్పాశయం
త్రకలాపంబు నివాతకూటపటలాంతస్తప్తబందీజనౌ
ఘకఠోరంబటులొప్పు నప్పురి జయుల్ఖానాయు ముత్యాలపే
టకుదగ్భాగమునన్మహానరకవాటప్రోత్కటాభీలమై. 1

మ. మలమూత్రాక్తమలీమసాంగులు పరిమ్లానాస్యనిమ్నాక్షులా
విలలోలప్రవికీర్ణకేశభరు లుద్వేలాంత్ర యంత్రాభగా
త్రులు జీర్యన్మలినాల్పకర్పటపరీతుల్గానబందీలునా
కులతం జెంది వసింతురందు నరకక్షుభ్యజ్జనప్రేక్ష్యతన్. 2

## ౨౪. పాఠశాలాప్రకరణము.

శా. మేలొప్పన్దగునప్పురంబునను నార్మేల్స్కూలు నయ్యాం

డ్రసర్, స్కూలుం బొల్పగుపచ్చయప్పవిభునాస్కూలున్వి
చారింప హైస్కూలున్లోనగుస్కూలు లప్పారిసిరు ల్గఁల్కుం
బఠద్బాలకో, న్మీలత్కంఠఘుళంఘుళ ల్వెలయ వాణీనాట్య
రంగాకృతిన్. 1

చ. పలకలు పుస్తకంబులును బాణిసరోజముల న్ధరించి ప
ఙ్క్తులు గొని దారుపాళిపయిఁ గూర్చుని వ్రాయుచుఁ బాడు
చున్నము,జ్జ్వలతర వేషము ల్వెలయ బాలురు తత్పురిఁ బాఠ
శాలలం, దలరుదు రంగభాస్కరుచిరాక్షరదైవతపఙ్క్తులో
యనన్. 2

క. హిందువు లునుపఁగ నాపుర
మందలరు నమందవిభ్రమాస్పదములై
హిందూవిద్యానిలయము
ముందగుపటుపాఠకూటము లనేకంబుల్. 3

## హౌసుప్రకరణము అనఁగా హూణ.

### ౨౯. వాణిజ్యశాలా ప్రకరణము.

మ. అలయార్బత్నెటుహౌసుబెన్నిహవుసొప్పారఁలయన్హౌసునా
బలుహౌసుల్మకిషాపులు న్వెలయు దీప్తశ్రీల నేతత్పురి
న్గలితద్వైపవిచిత్రవస్తుకలనన్వారాశిపుత్త్ర్యేకవ
త్సలతం పద్మకుఁ గూర్చుశైశవకళాంచత్కేళిసద్మాకృతిన్. 1

చ. వివిధవిచిత్రవస్తుచయవిభ్రమ మెన్నఁగ నేలగాచగో
ళవిసరవైభవంబులు ధళద్ధళదుజ్జ్వలదర్పణోపల
క్ష్యవిపులభూమికోన్నతులు నద్భుతశిల్పమునొప్పు హౌసులు
ద్దవిడిగనన్ దిగీశపురదర్శనకౌతుకముల్లభింపవే. 2

శా. నానానర్ఘ్యమనోజ్ఞవస్తువులకేనాడుం బరంగీకురం
గీనేత్రల్సనుదెంచి తన్నగరనిక్షిప్తంబులౌ షాపుల
స్థానాతీతవిశాలదర్పణగతామ్లానాంగులై పొల్తు ర
క్షీణక్షీరసరస్వదూర్మిచలదత్సిక్తాప్సరఃప్రక్రియన్. 3

క. హిందువులు నిల్పుషాపులు
నందలరన్ హూణులునుచుహౌసులకు ననుం
గుందమ్ములహౌసులును న
నిందితసంపదలచే ననేకములరయన్. 4

## ౨౬. దశావతార ప్రకరణము.

శా. పాథోరాశిపయఃపరిభ్రమణజభ్రాజన్మిథో ఘృష్టిసం
బాధోద్రేకబహిర్గతాత్మజఠరస్థాయద్విరించాండరే
ఖాధీదాయిమహోగ్రఘూత్కృతిమరుద్గాఢస్యదాభ్రాటదు
స్సాధత్క్ష్మాధరుఁడౌ రఘుషేంద్రుఁడు కృతిస్వామీష్టదుండయ్యె
డున్. 1

శా. అంభోధ్యున్మథనక్షణోద్ధసురదైత్యక్ష్వేళితధ్వానసం
రంభాత్యంతవిభిన్ననిష్పతదురుబ్రహ్మాండసౌధోద్యత

స్తంభస్కంధమహీధ్రమూలఫలకాంచత్పృష్ఠనైష్ఠుర్యని
ర్దంభుండౌ కమలేశ్వరుండు కృతికర్తన్ సత్కృపం బ్రోవుతన్.

మ. అతిదృప్యద్దనుజేంద్రహృద్దళననిర్యద్రక్తసిక్తాంతరు
ద్గతరోషానలరోచిరుజ్జ్వలబృహద్దంష్ట్రాంకురోగ్రద్విష
త్పతగప్రక్షయదీపికాగ్రరిపుహృత్కాలామిషత్క్ష్మాంజనో
ద్గతియయ్యాదిమకోలభర్త కృతిభర్తన్ బ్రీతి రక్షించుతన్.

మ. సరయస్తంభభి దార్భటీవిదళదాశాభిత్తిసంధిస్థిరీకరణవ్యగ్ర
సరోజసంభవకరాగ్రక్షిప్తమృత్పిండలి, స్ఫురదుద్ధూతసటా
చ్ఛటాచటులజంఝామారుతాభ్రాటదుర్భర భూధ్రుండు
నృసింహమూర్తి కృతికర్తన్ బ్రేమ బోషించుతన్. 4

మ. వియదూర్ధ్వప్రహితాంఘ్రి ఘట్టనదళ ద్వేధోండరంధ్రస్రవ
ద్రయపూర్ణావరణాంబుపూరమతికృద్బ్రహ్మప్రదత్తార్ఘ్యవా
ర్మయబర్హిర్ముఖ నిర్ఘరోపధియశోరాశ్యానిమజ్జజ్జగ [న్.
త్త్రయుఁడౌదంభవటుండొసంగుపురుషార్థంబుల్ కృతిస్వామికి

మ. స్వపితృఘ్నోరు పరశ్వధారణియుగాంచద్బాహుమంథో
దితోగ్రపటూద్భాసిమహానలాహుత నృపౌఘచ్ఛాగకాజ్య
ధ్వరాంతపరాసృగ్ఘ్రదసంభృతావభృథసత్కర్మాగ్రభూద
త్తకాశ్యపియాభార్గవరాముఁడీకృతిపతిన్ సత్ప్రేమఁ బోషిం
పుతన్. 6

మ. జనకాంతర్భవనస్థశాంభవధనుస్సంత్షోభణస్వాంతసం
జనితేర్ష్యాభరభార్గవార్పితధనుర్జ్యారోపజాన్యాంగనా
ర్తినితాంతభ్రమమైథిలీధువసపత్నీయజ్జయశ్రీవిలా
సనివాసుండగు రామదేవుఁడు కృతీశస్వాంతమందుండుతన్.

మ. హలసంక్షుణ్ణసమిద్ధరాముసలభిద్యత్కుంభికుంభస్థలో
చ్ఛలముక్తాఫలబీజజాతఖతలాంచత్కాయమానేద్ధకీ
ర్తిలతోద్యత్ఫలకోరకప్రసవ మాధ్వీభూతసూర్యోడుచం
ద్రలసద్యోధునియౌబలుండుకృతికర్తఁకూర్మిభావించుతన్.

మ. స్వమహాబాహుమహీధరోన్మథితసత్వస్ఫారకంసాదిదు
ర్దమదర్పాబ్ధిసముద్ధితాసదృశవీరశ్రీచ్ఛలశ్రీయశో
హిమధామామలసత్కథామిషసుధావ్యాప్తేందుఁడౌనందనం
దనుఁడేతత్కృతికన్యకాపతికి నిత్యంబుం బ్రసన్నుండగున్.9

మ. స్థిరతాధృశ్యస్వపురంధ్రికానిభృతపాతివ్రత్యవర్ష్మాభిగు
ప్తరణప్రౌఢిమదుర్జయత్రిపురదైత్యచ్ఛేదనార్థాదిక
స్మరథకారితబౌద్ధశాస్త్రమయభాస్వచ్ఛస్త్రరేఖామనో [న్.
హరుఁడయ్యాదిమబౌద్ధుఁడీకృతిపుదీర్ఘాయుర్యుతుఁ జేయుత

మ. నిజబాహాఫణిజిహ్వికానిభచలన్నిస్త్రింశనిర్భిన్నద్రరా
హుజవాక్రాంతనిఘృష్టదంతభవవహ్న్యుద్యచ్ఛిఖాఘృష్టిసం
ఘుజటాలోగ్రతురష్కమస్తకనిరీక్షానైకభానుగ్రహా [న్.
ర్తజగత్తుంగలికిఁ భజించెద కృతిప్రత్యూహముల్ మాన్పడ

ఉ. పండితకోటికిన్ మిగుల పామరమండలికిన్ మనంబులం
పండువు సేయునట్లు మృదుపాకముగా విశదార్థకంబుగా
నుండగ పహాణవైభవములొప్పఁగఁజేయుమటంచునాగభూ
మండలభర్తయానతిసమంబుగ నీకృతి నేనొనర్చితిన్. 12

భుజంగప్రయాతము.—

గుహోద్యద్భుజాటోప గూఢూరుసీవ్య
న్మహాప్రాజ్యసాంమ్రాజ్యమాన్య ప్రతాపా
ముహుర్ధ్వాకితాజాండమూర్ధాంతఢక్కా
బృహద్గాఢఢాంకారబిభ్యత్ప్రతీపా. 13

క. శ్రీమహితబొమ్మదేవర
భూమాన్వయకలశజలధిపూర్ణకళసుధా
ధామరిపులోకభయకృ
న్నామాద్భుతమంత్రశీల నాగనృపాలా. 14

గద్యము. ఇది శ్రీమన్మాల్యశైలనృసింహప్రసాదసమాసాదితసకల
శాస్త్రసంవిదుపస్కృతసంస్కృతాంధ్రసాహితీపురస్కృతసరస
సారస్వతచతురవాగ్ధోరణి మతుకుమల్లికులమతల్లికాబ్జవల్లి
కావియన్మణి కనకాద్రిశాస్త్రిబుధగ్రామణితనూభవాగ్రణి
నృసింహవిద్వన్మణిప్రణీతంబగు చెన్నపురీవిలాసం బను ప్రబం
ధంబునందు షష్ఠంబగు నంతరాళపద్ధతియును సర్వంబును
సంపూర్ణము.

తే. పద్ధతులు నారు వాటిలోఁ బ్రకరణములు
నరువదియునాల్గుగద్యపద్యములసంఖ్య
వెలయు ద్వాత్రింశదుత్తరద్విశతి సంహి
తయును ద్విశతోనసాహస్రి దలఁప నిందు. ౧౬. ౨౩౨.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.

